రాష్ట్రీయ స్వయంసేవక సంఘం

# తొలి వెలుగులు



హిందీ మూలం

శ్రీ వీరేశ్వర్

తెలుగు సేత

శ్రీ పి. గోపిరెడ్డి

నవభారతి ప్రచురణలు
హైద్రాబాదు

ప్రథమ ముద్రణ :

**సర్దార్ పటేల్ జయంతి**

31 అక్టోబర్, 1991

ప్రచురణ :

**నవభారతి ప్రచురణలు**

3-4-552, బర్కత్‌పురా,

హైద్రాబాద్-500 027.

ప్రతులకు :

**సాహిత్య నికేతన్**

బర్కత్‌పురా, హైద్రాబాద్-500 027.

**సాహిత్య నికేతన్**

ఏలూరు రోడ్, విజయవాడ-520 002

టైటిల్ ముద్రణ :

**కళాజ్యోతి ప్రాసెస్**

ముషీరాబాద్, హైద్రాబాద్-500 020.

ముద్రణ :

**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్**

1-1-517/బి/1, న్యూ బాకారం,

గాంధీనగర్, హైద్రాబాద్-500 380.

ఫోన్ : 66413

**వెల : రూ. 10-00**

# మనవి

రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్ నేడు చాలామందికి తెలిసిన సంస్థ. చాలామంది అభిమానించే సంస్థ కూడాను. అందుకు కారణం స్వయం సేవకులుగా పిలువబడే ఆ సంస్థ కార్యకర్తలు ప్రదర్శించే అనుశాసనమూ, దేశభక్తీ పలువుర్ని ఆకర్షించటమే. అయితే ఈనాడు ఆ సంస్థ సంపాదించుకున్న పేరు ప్రఖ్యాతుల వెనుక ఎందరో కార్యకర్తలు చేసిన కృషి ఉంది. వారందరి గురించీ తెలుసుకోవలసిన అవసరం ప్రతి స్వచ్ఛంద సేవాసంస్థ కార్యకర్తకూ ఉంది. అందులోనూ ప్రముఖులైన వారి త్యాగనిరతీ, కార్యదక్షతా, ప్రభావ సంపన్నమైన శీలమూ మనకు స్ఫూర్తి నందిస్తాయి.

ఆ భావనతో హిందీలో శ్రీ వీరేశ్వర్ వ్రాసిన 'సంఘ్‌కీ వ్ మే విసర్జిత్' అనే పుస్తకం ఆధారంగా తెలుగులో శ్రీ పులుసు గోపిరెడ్డి ఈ పుస్తకాన్ని మాకు అందించారు. శ్రీ వీరేశ్వర్‌కు, లోకహిత ప్రకాశన్ సంస్థకు, శ్రీ గోపిరెడ్డికి మా కృతజ్ఞతాపూర్వక వందనాలు.

ప్రజోత్పత్తి
ఆశ్వయుజ కృ. నవమి
సర్దార్ పటేల్ జయంతి
31, అక్టోబరు 1991
హైదరాబాదు

ప్రకాశకులు

---

## విషయసూచిక


| | | |
|---|---|---|
| మనవి | ... | 3 |
| ముందుమాట | ... | 4 |
| మాధవ్‌రావ్‌జీ మూలె | ... | 5 |
| భయ్యాజీదాణీ | ... | 64 |
| ఏకనాథ్‌జీ రానడే | ... | 91 |

# ముందు మాట

జాతీయ జీవనంలో రాష్ట్రీయ స్వయంసేవక సంఘం నిర్వహిస్తున్న పాత్ర అద్వితీయము, అనితర సాధ్యము అని ఈనాడు అందరూ గుర్తించారు. అయితే ఈ "సంఘ సౌధ" నిర్మాణంలో పునాదిరాళ్ళుగా నిలచిన ముగ్గురు మహనీయుల జీవిత చరిత్రలు సంగ్రహంగా ఈ చిన్న పుస్తకంలో పొందుపరచడం జరిగింది. వారు - శ్రీ ఏకనాథ్‌జీ రానడే, శ్రీభయ్యాజీ దాణీ, శ్రీ మాధవరావ్‌జీ మూలే-వీరి గురించి ఈనాడు అందరికీ తెలియక పోవచ్చు. కాని ఒకనాడు లక్షలాది సోదరీ, సోదరుల కన్నీటిని అమృత హృదయులై తమ చల్లటి చేతులతో తుడిచి సేదతీర్చిన మహనీయులు వీరు. దేశవిభజన కాలంలో కల్లోలిత ప్రాంతాలలో వారు, వీరు అనక అన్ని పార్టీలవారు వీరి ఆశ్రయం పొందడానికి అర్రులు చాచినవారే. జాతిసేవలో తమ వ్యక్తిత్వాన్ని దీపకళికవలె జ్వలింపచేసి ధన్యులైన వీరి జీవితాలు సమాజ కార్యంలో పనిచేసే ప్రతి ఒక్కరికీ స్ఫూర్తిదాయకం. నిరంతర పర్యటన - చిన్న, పెద్దలందరితో ఆత్మీయ ప్రవర్తన - కార్యసాధన కోసం కష్టాలెన్నైనా సహించే ఓర్పు - కావనుకున్న పనులను సైతం తమ వ్యవహార చతురతతో నెరవేర్చగల నేర్పు వీరి జీవితాలనుంచి మనం గ్రహించాలి. సంఘ కార్య నిర్మాణంలో వారు వేసిన "ముందడుగులు" నేటి కార్యకర్తలకు దారి సుగమం చేశాయన్నది సత్యం.

ఈ ముగ్గురు మహనీయుల జీవన విశేషాలతో శ్రీ వీరేశ్వర్ హిందీలో వ్రాసిన "సంఘ నీంవ్ మే విసర్జిత్..." అనే పుస్తకానికి ఇది అనువాదం.

—రచయిత.

## నవయుగ చాణక్య

# మాధవరావ్‌జీ మూలే

డాక్టర్ హెడ్గెవార్ దేశానికి స్వాతంత్ర్యం సంపాదించి, అన్ని రంగాలలోను ప్రగతి సాధించేందుకు అవసరమైన శక్తి యుక్తులు గల యువకుల నిర్మాణానికి పూనుకొన్నారు. అలా వారి కృషి ఫలితంగా తయారైన యువకులలో మాధవరావ్‌జీ మూలే ఒకరు. అయితే ఆయన అంతటి పరాక్రమవంతుడవుతాడని గానీ, కార్యదక్షుడవుతాడని గానీ ఆయనను చూచిన వారెవరూ ఊహించి ఉండరు. తన కార్యకుశలతవలన మాధవరావ్‌జీ తన పూర్వుల పరాక్రమ చిహ్నమైన భగవధ్వజాన్ని ఖైబర్ కనుమల దాకా ఎగురవేశారు. అంతేకాదు, భారత ప్రధానమంత్రి కూడా చేరడానికి అలవి కానటువంటి సింధు నది ఆవలి వడ్డుకుచేరి పూజ్య గురూజీని స్వాగతించే సౌభాగ్యానికి నోచుకున్నారు.

ఒక నిరుపేద కుటుంబంలో జన్మించిన మాధవరావ్‌జీ కేవలం సంకల్పబలంతో ఇంతటి ఉన్నతశ్రేణి కార్యకర్తగా తయారుకావడం ఇంకా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. చిన్నతనంలోనే తండ్రి మరణించగా కుటుంబ నిర్వహణార్థమై సైకిలు పంచర్లు వేయడం వంటి అనేక పనులు చేశారు.

7 నవంబరు 1912లో మహారాష్ట్రలోని రత్నగిరి జిల్లాలో ఉన్న 'ఓఝర్మఖోల్' గ్రామంలో జన్మించిన మాధవరావ్ కోండోపంత్ మూలే తన

అమ్మమ్మగారి తరఫున పూజ్య గురూజీకి బంధువులవుతారు. వారి పితరుల గ్రామం 'ఉస్' సంగమేశ్వరం వద్ద ఉండేది. మాధవరావ్‌జీ తండ్రిగారైన శ్రీ కోండోపంత్ బొంబాయిలోని ఫడ్కే గణపతి క్షేత్రానికి వ్యవస్థాపక పురోహితులుగా ఉండేవారు. వారి గృహవాతావరణం సంస్కృత భాషామృతాన్ని గ్రోలుతున్న ఒక వేదపాఠశాల ఉన్నట్లు ఉండేది. మాధవరావ్‌జీ యొక్క తల్లిగారి పూర్వీలు మూడుతరాల వారు ద్వారకలో నివసించే వారు. ఆమెగారి పితామహులు బరోడా సంస్థానపు ఆస్థాన సంగీత విద్వాంసుని వద్ద పురోహితులుగా ఉండేవారు. ద్వారకాధీశుని వద్ద పౌరోహిత్యం కూడా ఈ వంశంవారే నిర్వహిస్తూ ఉండేవారు.

మాధవరావ్‌జీకి ఒక సోదరుడు, ఆర్గురు సోదరీమణులు ఉండేవారు. వారి ప్రాథమిక విద్యాభ్యాసం తమ గ్రామానికి మూడు మైళ్ళ దూరంలో ఉన్న 'కోడంబ' గ్రామంలో జరిగింది. 1928 లో పైచదువుల కోసంగాను నాగపూర్‌లో ఉన్న తమ పెద్దక్కగారైన శ్రీమతి దుర్గాబాయ్ లఘాటే వద్ద చేరారు. చదువులలో ఆయన చాలా తెలివైనవారు వారు 7 వ తరగతి చదువుతున్నప్పుడు 'సుదామచరితం' పైన జరిగిన ఆంగ్ల వ్యాసరచన పోటీలో ఆంగ్లేయ బాలురతో పోటీపడి ప్రథమ బహుమతి సంపాదించారు.

ఈ కాలంలోనే మాధవరావ్‌జీ సంఘస్థాపకులైన డా॥ కేశవ బలీరామ్ హెడ్గేవార్ సంపర్కంలోనికి వచ్చారు. అనునిత్యం సన్నిహితులవుతూ డాక్టర్జీ యొక్క దివ్యానురాగానికి పాత్రులైనారు. మాధవరావ్‌జీ ఇంజనీరింగ్ చదివి ఒక పెద్ద పారిశ్రామికవేత్తగా కావాలనుకొనేవారు కానీ దేశభక్తి ప్రపూరితమైన డాక్టర్జీ వ్యక్తిత్వంచేత ప్రభావితులై ఆ ఉద్దేశ్యం వదిలిపెట్టేశారు. అయినా చదువు కొనసాగించి మెట్రిక్ పరీక్షలో ప్రథమ శ్రేణిలో కృతార్థులైనారు. 1930 లో కళాశాలలో చేరారు.

కళాశాలలో చేరారు, విప్లవోద్యమకారుల జీవితాలనుండి స్ఫూర్తి పొంది, కళాశాల చదువుకు కూడా స్వస్తి చెప్పారు.

అయితే గృహసంబంధమైన ఆర్థిక చిక్కులు గమనించి ఏదో ఒక ఉద్యోగం కాని, వృత్తిగాని చేపట్టాలని నిర్ణయించుకొన్నారు. నాగపూర్‌లో విఠల్‌రావ్‌జోగ్ గారు నిర్వహిస్తున్న సైకిల్ టైర్, ట్యూబ్ మరమ్మత్తుల కంపెనీలో చేరి శిక్షణ పొందటం ప్రారంభించారు. దురదృష్టవశాత్తు ఈ సమయంలోనే తండ్రిగారు దివంగతులైనారు. దానితో స్వగ్రామం చేరుకోవలసివచ్చింది. చిపలూణ్ గ్రామంలో వల్కనైజింగ్ పని ప్రారంభించారు. కాని కొంతకాలం అయ్యేసరికి బాగా నష్టాలు వచ్చాయి. దానితో ఒక వృత్తిలో స్థిరపడాలన్న ఆలోచన కనుమరుగైంది. ఈ స్థితిలో డాక్టర్‌జీతో కలిసి మాట్లాడటానికని నాగపూర్ వెళ్ళారు.

ఇంట్లో వాళ్ళు పెళ్ళి చేసుకొని గృహస్థు కమ్మంటున్నారు. కానీ డాక్టర్‌జీ ద్వారా ప్రేరణ పొంది జీవితాంతం సంఘ కార్యం నిర్వహించాలనే బలమైన కోరిక మాధవరావ్‌జీకి ఉంది. చివరకు 1931లో డాక్టర్‌జీతోపాటు మాధవరావ్‌జీ కూడా మహారాష్ట్ర ప్రాంత పర్యటనకు ఉపక్రమించారు. ఈ పర్యటన కాలంలోనే జీవనగమ్యాన్ని నిర్దేశించగల మహానుభావులు మాధవరావ్‌జీకి ప్రాప్తించాయి. ఈ సందర్భంలోనే డా॥ నారాయణరావు సావర్కర్ (స్వాతంత్ర్య వీర సావర్కర్ చిన్న తమ్ముడు), శ్రీ విశ్వనాథరావు కేల్కర్, శ్రీ కాశీనాథ పంత్ లిమయే మొదలైన మేటి సంఘసేవకుల పరిచయ భాగ్యం లభించింది. తత్ఫలితంగా సంఘ సేవకే జీవితం అంకితం చేయాలనే కోరిక వారిలో మరింత బలపడింది.

అయితే డోలాయమానంగా తయారైన గృహ ఆర్థికస్థితిని గుర్తుంచుకొని, తమ పెద్ద సోదరి, బాబాయి ఇచ్చిన సలహా మేరకు 'చిపలూణ్'కు

తిరిగివచ్చారు శ్రీ మాధవరావు. తిరిగి వచ్చేటప్పుడు వీడ్కోలు చెప్పడానికి స్వయంగా డాక్టర్‌జీ స్టేషన్‌కు వచ్చారు. డాక్టర్‌జీకి మాధవరావ్‌జీ పట్లగల అవ్యాజానురాగం ఎంతటిదో దీనిద్వారా మనకు బోధపడుతుంది అంతేకాదు, సాగర సదృశమైన ఆ చల్లని ప్రేమను కాదనగల సామర్థ్యం ఎవరికి ఉంటుంది?

## సిసలైన వికెట్ కీపర్

కుటుంబానికి తోడ్పడడంతో పాటు కొంకణ ప్రాంతంలో సంఘ కార్యవిస్తరణకు పాటుపడవచ్చుననే ఉద్దేశ్యంతోనే మాధవరావ్‌జీ చిపలూణ్‌కు వెళ్ళారు. కేవలం ఒక సంవత్సర కాలంలోనే అక్కడ అన్ని వర్గాల ప్రజలతోనూ సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకున్నారు. ముఖ్యంగా విద్యార్థులకు చాలా దగ్గరయ్యారు. విద్యార్థులతో పాటు క్రికెట్ ఆడుతుండేవారు. ఆయన మంచి వికెట్ కీపర్ కూడా. నిజానికి తమ సంపర్కంలోనికి వచ్చిన ప్రతి విద్యార్థి జీవితం 'స్టంప్' చేసి, సంఘ గంగలో ముంచాలనేదే వారి కోరిక. విద్యార్థులకు డబుల్ బార్, ఇంకా ఇతర ఆటలు కూడా నేర్పుతుండేవారు.

మాధవరావ్‌జీ భజన కీర్తనలు పాడడంలోను, తబలా వాయించడంలోనూ నిష్ణాతులు. గోకులాష్టమి, శ్రీరామనవమి పండుగల సందర్భాలలో శ్రీ లక్ష్మీనారాయణ మందిరంలోను, రామ మందిరంలోను భగవంతుని పల్లకి మోసేటప్పుడు ఆయన పల్లకిముందుండి తన్మయంగా నాట్యం చేస్తూ, గానం చేస్తూ ఉండేవారు. ఇలాంటి కార్యక్రమాలన్నింటి వల్ల ఆయన యువకులను ఎక్కువగా ఆకర్షించేవారు.

ఈ కార్యక్రమాల ద్వారా లభించిన పరిచయాలను పురస్కరించుకొని 28 ఫిబ్రవరి, 1933లో చిపలూణ్‌లో ప్రభాత్ శాఖ ప్రారంభించారు. కొంత కాలం పోయాక అక్కడ సాయం శాఖ ప్రారంభమైంది. ఈ శాఖల

ద్వారా కార్యకర్తల నిర్మాణం ప్రారంభమైంది. కేవలం రెండు సంవత్సరాలలోనే నలుగురైదుగురు విస్తారకులు తయారైనారు. వీరిద్వారా అనేక చోట్ల శాఖలు ప్రారంభించబడ్డాయి. ఈలోగా మాధవరావ్‌జీ ఘోష్ సామాగ్రిని కూడా కొన్నారు. 1935లో 60 మంది పూర్ణ గణవేష ధారీ స్వయంసేవకులతో ఘోష్ వాద్యాలతో పథసంచలనం నిర్వహించారు.

1936లో స్వయంగా ఆ శాఖలు చూడటానికి డాక్టర్‌జీ అక్కడికి వచ్చారు. ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా ఎప్పటికప్పుడు విశేషాలు తెలుసుకొంటూ ఉన్నప్పటికీ స్వయంగా శాఖల అభివృద్ధి చూశాక డాక్టర్‌జీ చాలా సంతోషించారు. ఆ తర్వాత మాధవరావ్‌జీ అభ్యర్థనను పురస్కరించుకొని శ్రీయుత దాదారావ్ పరమార్థ్, గోపాలరావ్ యేరకుంటవార్ వంటి ప్రముఖ ప్రచారకులు, విశుద్ధ కార్యప్రణాళిక నందించగల ఏకనాథ్‌జీ వంటి ప్రముఖులు ఆ ప్రాంతంలో పర్యటించారు.

## సమాజ కార్యమే సర్వస్వం

శాఖలు దినదిన ప్రవర్ధమానంగా ఉన్నాయి. కానీ తన దుకాణం పనిలో శ్రద్ధ చూపించలేని కారణంగా అది క్షీణించ నారంభించింది. ఇక లాభం లేదనుకొని మాధవరావ్‌జీ ఆ దుకాణాన్ని అద్దెకు ఇచ్చేసి పూర్తిగా సంఘ కార్యంలోనే నిమగ్నమై పోయారు. తల్లి, బాబాయి ఆగ్రహించారు. అయినా ప్రయోజనం లేకపోయింది. మొదట్లో కొన్ని రోజుల పర్యంతం ఇల్లు వదలి వెడుతూ వచ్చినవారు రానురాను మాసాల తరబడి ఇంటికి రాకుండా పర్యటనలోనే మునిగిపోతుండేవారు. క్రమంగా మాధవరావ్‌జీ తత్వం అర్థం అయ్యాక సంవత్సరంలో ఒకటి రెండుసార్లు అయినా ఇంట్లో కనిపిస్తూ ఉంటే చాలు అనుకొనేది తల్లిగారు.

మాధవరావ్‌జీ దేశం కోసం అనేకసార్లు జైలుకు కూడా వెళ్ళారు. 1937లో హైద్రాబాదు నవాబు హిందువుల ఆరాధనా స్వేచ్ఛను హరించ డానికి ప్రయత్నించినప్పుడు దానికి వ్యతిరేకంగా ఆందోళన జరిపి మొదటి సారి జైలుకు వెళ్ళారు. ఆ తర్వాత 1938 లో పూనాలోని ఆంజనేయ స్వామి గుడిలో గంటలు కొట్టడాన్ని ముస్లింలు వ్యతిరేకించగా, దానిని నిరసిస్తూ సత్యాగ్రహం చేసి జైలుకెళ్ళారు. అలాగే 1948లో సంఘం పైన విధించిన మొదటి నిషేధకాలంలోను, కాశ్మీర సత్యాగ్రహంలోను పాలుపంచుకొని జైలుకెళ్ళారు.

ఈలోగా మాధవరావ్‌జీ తృతీయవర్ష సంఘ శిక్షావర్గ శిక్షణ కూడా పూర్తిచేసుకున్నారు. ఆ తర్వాత 1938లో సంఘశిక్షా వర్గకు శిక్షక్‌గా నాగపూర్ వెళ్ళారు. ఈ శిక్షావర్గకు శ్రీ గురూజీ సర్వాధికారిగా ఉన్నారు. ఆ తర్వాత సంవత్సరం ఇక ఇంటిమీద వ్యామోహం విడిచిపెట్టేసి నాగపూర్ వచ్చేశారు. ఈ సంవత్సరమే, అనగా 1939లో శ్రీ గురూజీని సర్ కార్యవాహగాను, శ్రీ బాబాసాహెబ్ ఘటాటేజీని నాగపూర్ సంఘ చాలక్ గానూ ప్రకటించటం జరిగింది.

1940లో డాక్టర్‌జీ దివంగతులైనాక మాధవరావ్‌జీని పంజాబ్ ప్రాంత ప్రచారకులుగా నియుక్తిచేసి లాహోర్ పంపించారు. 1973లో శ్రీ గురూజీ స్వర్గస్థులయినప్పటి వరకు 33 సంవత్సరాల పర్యంతం మాధవరావ్‌జీ పంజాబ్ ప్రాంతంలోనే ఉన్నారు. 1959లో వారు క్షేత్ర ప్రచారకులుగా నియుక్తులైనారు. 1962లో శ్రీ అనంత రామచంద్రగోఖలే పంజాబ్ ప్రాంత ప్రచారకులుగా నియమించబడేంత వరకు క్షేత్ర ప్రచారక్‌గా ఉంటూనే పంజాబ్ ప్రాంత ప్రచారక్ విధులుకూడా మాధవ రావ్‌జీ యే నిర్వహిస్తూ వచ్చారు.

# పవిత్ర ధ్యేయ సాధనలో...

జూన్ 21, 1940 నాడు డాక్టర్‌జీ దివంగతులైనారు. జూలై 1 వ తేదీ వారి ప్రథమ మాసికదినాన ఒక్క నాగపూర్ శాఖనుంచే 22 మంది సంఘ కార్యకర్తలు ప్రచారకులుగా జీవితాన్ని ప్రారంభించారు. ఈ సందర్భంలోనే మాధవరావ్‌జీని పంజాబ్ ప్రాంత ప్రచారక్‌గా పంపించారు. వీరితోపాటు శ్రీ బాబూరావు పార్థీకర్, శ్రీ కళ్యాణి, పండిత్ లేఖ్‌రాజ్ శర్మ కూడా ప్రచారకులుగా పంజాబుకు వెళ్ళారు.

డాక్టర్‌జీ మాసిక దినాన లాహోర్ నుంచి ధర్మవీర్‌జీ, భాయీ మహావీర్‌జీ, హాతుర్‌కర్‌జీ నాగపూర్ వచ్చారు. అలాగే ముల్తాన్ నుంచి డాక్టర్ బర్మన్, రావల్పిండి నుంచి డా॥ హరవంశలాల్, కస్తూరిలాల్‌జీ వచ్చారు. మాధవరావ్‌జీతో పాటు ఇంకా ముగ్గురు ప్రచారకులు కూడా జూలై 22 నాడు పంజాబుకు బయలుదేరారు. దారిలో టిమారనీలోని శ్రీ భావుసాహెబ్ భుస్కుటే గారింట్లో బస చేశారు. ఆ తర్వాత గ్వాలియర్, ఢిల్లీ పట్టణాలలో బసచేసి, జూలై 26 నాడు లాహోర్ స్టేషన్‌లో దిగారు. అక్కడి నుంచి పార్థీకర్‌జీ ఫిరోజ్‌పూర్‌కు, కళ్యాణీజీ లాయల్పూర్‌కు, లేఖ్‌రాజ్‌జీ ముల్తాన్‌కు పంపించబడ్డారు. మాధవరావ్‌జీ లాహోర్‌ను తమ కేంద్రంగా పెట్టుకొని పని ప్రారంభించారు.

మాధవరావ్‌జీకి పంజాబ్‌కు వెళ్ళకముందు అక్కడి వేష భాషలతోగాని, ఆచార వ్యవహారాలతోగాని, ప్రజల మనోభావాలతోగాని ఏమాత్రం పరిచయం లేదు. అక్కడ ఉండేందుకు వసతిగాని, భోజన వ్యవస్థగాని ముందుగా ఏర్పాటు చేయబడలేదు. కాబట్టి ఎక్కడ వీలైతే అక్కడ ఉండేవారు. దొరికింది తిని ఆకలి తీర్చుకునేవారు. ఇలా గడపడం వలన అనేక మందికి సన్నిహితులైనారు. అంతేకాదు. అక్కడి ప్రజల మనస్తత్వం కూడా బాగా బోధపడింది.

## అడ్డంకులు లెక్కలేదు

ఆ రోజుల్లో పంజాబ్ ప్రభుత్వం సంఘకార్యం పట్ల తీవ్ర వ్యతిరేకతతో ఉండేది. కాని దానిని ఏమాత్రం లెక్కచేయకుండా యువశక్తిని సమీకరించడంలో ముందుకు సాగిపోయారు మాధవరావ్‌జీ. కళాశాలలను, విశ్వవిద్యాలయాలను తరచుగా సందర్శిస్తూ శాఖలు నెలకొల్ప సాగారు. ఆయన ద్వారా స్ఫూర్తిని పొందిన యువకులు క్రమక్రమంగా సంఘ కార్యంలో ముందుకు రాసాగారు. అంతేకాదు, తమ విద్యాభ్యాసం పూర్తిచేసుకొన్న యువకులు అవిశ్రాంతంగా సంఘ కార్యాన్ని కొనసాగించేందుకు స్వగృహాల్ని విడిచిపెట్టి ప్రచారకులుగా పనిచేయడానికి ముందుకు వచ్చారు. వాస్తవానికి పంజాబ్ ప్రాంతంలో మాధవరావ్‌జీ చేపట్టిన సంఘకార్య సాఫల్యానికి ఈయువకులే పట్టుకొమ్మలైనారు.

పంజాబ్‌లో సామాజిక పరిస్థితికూడా చాలా విచిత్రమైనది. ఆర్య సమాజంవారు సంఘానికి వచ్చేవారుకాదు. అప్పుడప్పుడు రావడం జరిగినా ధ్వజానికి ప్రణామ్ చేసేవారుకాదు. ప్రార్థన అంతంలో 'భారత్‌మాతాకీ జై' అనేవారుకాదు. అంతేకాదు ఆర్య సమాజంవారు సంఘ కార్యకారిణికి సమాంతరంగా తమదైన మరో కార్యకారిణిని ప్రకటించేసుకొన్నారు. అయినప్పటికీ మాధవరావ్‌జీ కార్యకుశలత, దూరదృష్టి, విశిష్ట కార్యప్రణాళికారచన కారణంగా ఈ అడ్డంకులు ఒక్కొక్కటిగా తొలగిపోయి, సంఘ కార్యవిస్తరణ దీర్ఘవ్యాప్తమై భగవాధ్వజం ఖైబర్ కనుమల అంచులుదాకా రెపరెపలాడింది.

మాధవరావ్‌జీ ప్రతి నగరంలోను హిందుత్వాభిమానులైన వ్యక్తులను, సంస్థలను కలుసుకోవడం ప్రారంభించారు. అలాంటి వారిలో ఆర్యసమాజం, సనాతన ధర్మసభ, సింహసభ, హిందూమహాసభ, గురు

ద్వారాలకు చెందినవారు అనేకులున్నారు. ఆ కారణంగానే నామధారి సిక్కు సంప్రదాయానికి చెందిన ప్రముఖనేత సద్గురు ప్రతాపసింహాజీ సంఘ కార్యానికి పూర్తి మద్దతు నిచ్చారు.

అయినా అడుగడుగునా అడ్డంకులు ఎదురవుతూనే వచ్చాయి. 1941లో బాధియానాకు చెందిన హిందూమహాసభ నాయకులు కుందన్ లాల్‌జీ మాధవరావ్‌జీ సంపర్కంలోకి వచ్చారు. సంఘము, హిందూ మహాసభ రెండూ హిందుత్వవాద సంస్థలే అయినప్పుడు ఈ రెండింటికీ తేడా ఏముంది? అని అడిగారు. మాధవరావ్‌జీ దానికి సమాధానం చెపుతూ, సంఘానికి హిందుత్వం పట్లగల ప్రేమాభిమానం హిందూ మహాసభవారు అనుసరిస్తున్న ఉగ్రవాదానికి భిన్నమైనట్టిది అని స్పష్టం చేశారు. కార్యం పట్ల శ్రద్ధాసక్తులు పెంపొందడం ద్వారా ఎలాంటి త్యాగాలకైనా వ్యక్తులు సిద్ధపడతారు. కాబట్టి హిందుత్వం, హిందూ సంస్కృతి, హిందూదేశం పట్ల శ్రద్ధను పెంపొందించే కార్యం సంఘం చేపట్టింది. ఈ విషయాన్ని ఇంకా స్పష్టంగా చెప్పేందుకు మరొక ఉదాహరణ చెప్పారు. లాహోర్‌లో హిందూమహాసభ నాయకులు భాయీ పరమానంద్‌గారి ఇంట్లో 1937 నుండి 1940 వరకు సంఘకార్యాలయం ఉండేది. భాయి పరమానందజీ ఉన్నతశ్రేణికి చెందిన ప్రతవీరుడు మతీరాం వంశానికి చెందినవాడు. గురు తేగ్ బహదూర్, భాయీ దయాల్‌లతో పాటు మతీరాంను అనాటి విధ్వంసక మొగలాయి ప్రభుత్వం బలిగొన్నది మతిరాంను కత్తితో నిలువునా చీల్చి చంపారు. అలాంటి పవిత్ర రక్తం ప్రవహిస్తున్న భాయీ పరమానంద్ లాంటి వారిపట్ల సంఘానికి ఎప్పుడూ శ్రద్ధాభావం ఉంది. భాయీ పరమానంద కూడా సంఘం వారిని అమితంగా ప్రేమించేవారు. ప్రారంభదినాలలో హిందూమహాసభ ఆధ్వర్యంలో సంఘం కలసి పని చేయాలని ఆయన కోరారు. కాని ఆ తర్వాత సంఘకార్యాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకున్నాక ఆ అభిప్రాయాన్ని వదిలేశారు.

# కావలసింది కార్యం - ప్రచారం కాదు

భాయీ పరమానందజీ ఉదాహరణ ఉటంకించిన తర్వాత కుందన్ లాల్‌జీ మరో ప్రశ్న వేశారు- 'సంఘాన్ని గూర్చి పత్రికలలో విరివిగా ప్రచారం చేస్తే సంఘకార్యం వేగంగా పుంజుకోదా?' ఈ ప్రశ్నకు సమాధానంగా, 'ఆచరణలో సాధించవలసిన విషయాలను కాగితాలపైన సాధించలేము. పత్రికలలో ప్రచారం పెరుగుతున్న కొద్దీ ప్రత్యక్ష కార్యం పట్ల శ్రద్ధ తగ్గుతూపోతుంది. ప్రసిద్ధిపొందటం పట్లనే ధ్యాస పెరుగుతుంది. ప్రచారం పొందాలన్న వ్యామోహం క్రమక్రమంగా పతనంవైపుకే పరుగులు తీస్తుంది. అసలు ప్రచారం కావాలన్న ఆలోచనవైపు స్వయంసేవకుల దృష్టి మరలకుండా చూడాల్సిన అవసరం ఉంది. అందుకే సంఘంలో ఈ పాట పాడుతూ ఉంటాం—

"వృత్త పత్రమే నామ్ ఛపేగా, పహనూంగా స్వాగత సుమహార్
ఛోడ్ చలే యహ క్షుద్ర భావనా, హిందురాష్ట్ర కే తారణహార్"

(వార్తా పత్రికలలో పేరు పడాలని, పూలహారాలు మెళ్ళో పడాలని కోరుకోకు. అలాంటి క్షుద్రమైన భావన విడిచిపెట్టి హిందూ రాష్ట్రసిద్ధికి ఉపక్రమించు.)

ఇదేవిధంగా ముల్తాన్ పట్టణవాసి లచ్చూరాంజీతో కూడా మాధవరావ్‌జీ అనేక సార్లు చర్చిస్తూ ఉండేవారు. 1942 లో క్విట్ ఇండియా ఆందోళన కొనసాగుతున్న రోజుల్లో - 'మాధవరావ్‌జీ, మీరు సంఘ స్వయంసేవకులందరినీ ఈ ఉద్యమంలో పాల్గొనేటట్లు చేసి తెల్లదొరలకు మంచి గుణపాఠం నేర్పండి' అన్నారు లచ్చూరాంజీ. దానికి సమాధానంగా, 'దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించాలని కోరుకోవడమే కాదు, ప్రతి స్వయం

సేవక్ దాస్యశృంఖలాల నుండి భారతమాత విముక్తికై పాటుపడతానని ప్రతిజ్ఞ చేస్తాడు. అంతేకాదు. ఆ జీవన పర్యంతం సంఘ కార్యం కొనసాగిస్తానని, దేశం స్వాతంత్ర్యం సాధించేవరకు విశ్రాంతి తీసుకోనని కూడా ప్రతిజ్ఞ చేస్తాడు. సంఘ కార్యాన్ని సుదృఢంగా విస్తరిస్తూపోయి కేవలం ఆంగ్లేయులు ఈ భూమిని విడిచిపోవడం మాత్రమే కాదు మరే శత్రువు ఈ భూమిని ఆక్రమించాలనే ప్రయత్నానికి పూనుకోనంతటి శక్తిశాలినిగా ఈ సమాజాన్ని మార్చివేస్తాడు' అన్నారు మాధవరావ్‌జీ. ఈ సమాధానం విన్నాక సంతృప్తి చెందకపోవడానికి అవకాశం ఏది?

## వాస్తవిక దృష్టి - తార్కికమైన జవాబు

ఒకసారి మాటల సందర్భంలో, 'నాజీ నియంత హిట్లర్‌నుండి స్ఫూర్తిపొంది సంఘాన్ని ఒక మిలిటరీ సంస్థలాగా డాక్టర్‌జీ రూపొందించారన్నది నిజమేనా?' అని అడిగాడు ఓ పెద్దమనిషి. దానికి సమాధానంగా, 'హిట్లర్‌వలన ప్రేరణ లభించిందని ఎలా అనగలుగుతున్నారో అర్థంకాదు. సంఘం 1925లో ప్రారంభించబడింది. ఆ సమయంలో హిట్లర్‌గాని, ముస్సోలినీగాని ఏ రకంగానూ ప్రసిద్ధవ్యక్తులు కారు. ఆ రోజుల్లో సంఘ కార్యాన్ని పోలిన సంస్థలను వారు నడిపిన జాడకూడా లేదు. అయితే సంవత్సరంలో ఒకటి రెండుసార్లు ఆంగ్లప్రభుత్వం జరుపుతూ వచ్చిన ఫ్లాగ్ మార్చి వంటి ప్రదర్శనను భారత ప్రజలలో ధైర్యసాహసాలు నింపడానికి స్వయంసేవకుల చేత డాక్టర్‌జీ జరిపించి ఉండొచ్చు' అన్నారు మాధవరావ్‌జీ. ప్రశ్న అడిగినాయన నోట మాటరాలేదు.

సంఘానికి సంబంధించిన విషయాలలోనేకాదు, సమాజ స్థితికి సంబంధించి, దేశపరిస్థితులకు సంబంధించి చక్కటి అవగాహన, దూరదృష్టితో మాధవరావ్‌జీ వ్యవహరించేవారు. పాకిస్తాన్ ఏర్పాటు, హిందూ

ముస్లిం సంబంధాలలో ఉత్పన్నమయ్యే పరిణామాలను గూర్చి వారెంత చక్కగా ఊహించారో ఈ క్రింది ఉదంతం తెలియజేస్తుంది.

## మరో అనర్థం జరిగి తీరుతుంది

1945లో రావినది ఒడ్డున లాహోర్‌లోని బ్రహ్మవిద్యాలయంలో పంజాబ్‌లోని ప్రముఖ కార్యకర్తల వర్గ జరుగుతోంది. లాహోర్‌కు చెందిన గోపాల్‌చంద్ర 'నిజంగా పాకిస్తాన్ ఏర్పడుతోందంటారా?' అని అడిగారు.

'ఇంతవరకు దేశంలోని ప్రముఖ రాజకీయ పార్టీలు, కాంగ్రెస్ నేతలు పాకిస్తాన్ ఏర్పడటం కల్ల అనే చెబుతున్నారు. చివరిదాకా ఈ మాటపైన నిలబడి ఉంటే పాకిస్తాన్ ఏర్పడదు. కానీ ఏ మాత్రం రాజీ పడినా అనర్థం తప్పదు' అన్నారు మాధవరావ్‌జీ.

'పాకిస్తాన్ ఏర్పాటుకు ఆంగ్లేయులు ఒప్పుకొంటారా?' అని మరో ప్రశ్న అడిగారు గోపాల్‌చంద్రజీ.

'వాళ్ళదేమి పోతుంది? ఒకవేళ భారతదేశం స్వాతంత్ర్యం పొందినప్పటికీ బలహీన రాజ్యంగా ఉండిపోయి ఎల్లప్పుడు బ్రిటిష్‌వారిని ఆశ్రయించి ఉండే పరిస్థితికి దారితీసే ఏ కోర్కెకైనా వారు అంగీకరిస్తారు' అన్నారు మాధవరావ్‌జీ.

'పాకిస్తాన్ ఏర్పాటు అయ్యాక ముసల్మానుల మతాంధత ఏ రూపంలో ఉంటుంది?' అడిగారు భాయి మహావీర్.

'పాకిస్తాన్ ఏర్పడితే ముసల్మానుల మతాంధత పెచ్చుపెరిగిపోతుంది. పాకిస్తాన్‌లో మిగిలిపోయిన హిందువులు అక్కడ మనుగడ

సాగించలేని పరిస్థితులు కల్పిస్తారు. అత్యాచారాలు, బలవంతపు మతం మార్పిడులు, మహిళల అపహరణలు, హిందువులపై ఆర్థిక దిగ్బంధనలు కొనసాగించి హిందువులు నిర్వాసితులుగా తరలివెళ్ళే పరిస్థితి కల్పిస్తారు అన్నారు మాధవరావ్‌జీ.

'అలాంటప్పుడు హిందుస్తాన్‌లో భయంకరమైన ప్రతిక్రియ కొనసాగదంటారా?' అడిగారు జగదీశ్ అబ్రోల్.

'అలా జరగడానికి అవకాశం లేదు. ఒకవేళ హిందుస్తాన్‌లో అలాంటిది జరిగినా చెదురువాటుగా అక్కడక్కడ కొన్ని సంఘటనలు మినహా ఎక్కువ కాలం సాగదు భారతదేశంలో హిందువులలో సహిష్ణుత, ఉదార స్వభావం హెచ్చు. అల్పసంఖ్యాకులు, బలహీనులు అయిన ముసల్మానులపై చిత్రహింసలు సాగించి, వారు భారతదేశం వదలివెళ్ళే విధంగా ప్రవర్తించరు' అన్నారు మాధవరావ్‌జీ.

'అలాంటప్పుడు బలహీనులైన ముసల్మానులలో మతమౌఢ్యం తగ్గిపోయి భారతీయ జీవన స్రవంతిలో కలిసిపోతారు కదా! సంఘం కోరుకొంటున్నది కూడా ఇదేకదా? కొంతకాలం ఇలా సాగితే ముసల్మానులు సిసలైన దేశభక్తులుగా మారిపోతారు. మంచిదే కదా?" అడిగారు బాబూరావ్ పాల్ధికర్.

'నిజంగా అలా జరిగితే అంతకంటె కావలసిందే ముంటుంది? కాని అన్ని విషయాల్లోనూ భరోసా పనికిరాదు లోతుగా ఆలోచించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. పంజాబ్ ముస్లింలు ఎంత కఠోరంగా మారిపోయారో మనం చూస్తూనే ఉన్నాం. ఇలాంటి వాళ్ళు పాకిస్తాన్‌లో హిందువులను ఎలా ఉండనిస్తారు? పాకిస్తాన్ ఏర్పడితే ఈ విద్వేష జ్వాల పెచ్చు పెరిగి పోతుంది. హిందుస్తాన్ పట్ల వారికి శ్రద్ధాభక్తులు ఏర్పడుతాయను కోవడం పొరపాటు' అన్నారు మాధవరావ్‌జీ.

# పౌరబోని దూరదృష్టి

'భారత్‌కు, పాకిస్తాన్‌కు యుద్ధం జరిగితే ఏమవుతుంది?' అడిగారు గోపాల్‌చంద్రజీ.

'పాకిస్తాన్ ఏర్పడ్డ తర్వాత కూడా భారతీయ ముస్లింలకు అది లభించడం లేదు, ఇది లభించడంలేదు అంటూ భారత దేశానికి వ్యతిరేకంగా ప్రపంచవ్యాప్తంగా ఉన్న ముస్లింల ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడానికి పాకిస్తాన్ ప్రయత్నిస్తుంది. యావద్భారతదేశం నేడో రేపో ముస్లింల ఆధీనంలోకి వచ్చితీరుతుందని పాకిస్తాన్ నిర్మాణానికి కృషి చేస్తున్నవారు కలలు కంటున్నారు' అన్నారు మాధవరావ్‌జీ.

తమ సమాధానాన్ని కొనసాగిస్తూ, 'ఇంకొక ముఖ్య విషయం గుర్తుంచుకోవాలి. ఏ మాత్రం అవకాశం చిక్కినా భారత దేశంలో ఉన్న ముస్లింలు పాకిస్తాన్ పట్ల సానుభూతి ప్రదర్శించడానికి వెనుకాడరు. ఒక వేళ ఈ రెండు దేశాలమధ్య యుద్ధమే సంభవిస్తే పాకిస్తాన్ గెలవాలని ముస్లిం కోరుకుంటాడు. భారత్ గెలవాలని హిందువు కోరుకుంటాడు. ఆ పరిస్థితిలో ఇరు వర్గాల మధ్య అవిశ్వాసం, అనుమానం, ద్వేషం చోటు చేసుకొంటాయి. ఇది చాలా శోచనీయమైన పరిస్థితిగా మారుతుంది. రెండు దేశాలలోనూ అల్ప సంఖ్యాకులు భీతావహమైన వాతావరణంలో జీవిస్తారు. కాబట్టి మత ప్రాతిపదికపై దేశ విభజన జరగరాదని మనసారా కోరుకొంటాము. దేశ విభజన జరిగిందంటే ఉన్న సమస్యలు పరిష్కారం కాకపోగా క్రొత్తసమస్యలు ఉత్పన్నమవుతూ పోతాయి' అన్నారు.

ఈ రీతిలోనే 1946లో లాయల్‌పూర్ జిల్లా చకఝుమరా పట్టణంలో పంజాబ్‌కు చెందిన ప్రముఖ కార్యకర్తల సమావేశంలో మాధవరావ్‌జీ సూటిగా కొన్ని విషయాలు ప్రస్తావించారు.

'ఈ రోజుల్లో అనేకచోట్ల కొట్లాటలు జరుగుతున్నాయి అశాంతి వ్యాపించి ఉంది. ఈ స్థితిలో అసలైన సంఘకార్యం కొనసాగించడం కష్టమే. ఒకవేళ కొనసాగించినా అనుకొన్న ప్రకారం కార్యం జరగదు.

ఈ రాజకీయ సుడిగుండంలో కూడా మనం శాంతి స్థాపనకు కృషి చేస్తూ ఉండాలి. సంఘశ్రేయస్సు, దేశ శ్రేయస్సు శాంతిలోనే ఇమిడి ఉన్నాయన్న సంగతి మరువకూడదు. ఆంగ్లేయుల మాయలోపడి ముస్లిం లీగ్ వారు ఉత్పాతం సృష్టిస్తున్నారు. రక్తపాతానికి ఒడిగడుతున్నారు. అయినా మనం ఆవేశానికి లోను కారాదు. ఆవేశానికి లోనై మనం కూడా శాంతిభంగం జరగడానికి దోహదపడితే ఎక్కువగా నష్టపోయేది సంఘం అవుతుంది. మనం ఎంతో సంయమనంతో వ్యవహరించవలసి ఉంది. ఈ సుడిగుండంనుంచి మన నావను కాపాడి దరి చేర్చవలసిన అవసరం ఎంతైనా ఉంది.'

## ...లేకుంటే మన స్వప్నం అసంపూర్తిగా మిగిలిపోతుంది

'ఈ కొట్లాటలు, విధ్వంసకాండలో అర్థరహితంగా మనం పాల్గొన్నట్లయితే ప్రజలు సంస్థని అర్థం చేసుకోవలసినరీతిలో అర్థం చేసుకోలేక పోతారు. ఉద్రేకపూరితులైన, దుష్టబుద్ధిగల యువకులు కొందరు విధ్వంస కాండకు పాల్పడే ఉద్దేశ్యంతోనే సంఘంలో చేర్తారు. అలాంటప్పుడు మౌలికమైన సంఘకార్యం ప్రక్కకు నెట్టబడి, దుండగాలకు పాల్పడే సంస్థగా సంఘానికి చెడ్డపేరు వస్తుంది. ఇలా జరిగినట్లయితే అతి ప్రాచీన మైన మనదేశానికి పూర్వ ఔన్నత్యాన్ని చేకూర్చి, విశ్వగురు స్థానాన్ని సంపాదించి పెట్టాలని మనం కన్న కలలు కల్లలే అవుతాయి.

'ఈనాడు ఎం.ఎ, ఎం.యస్.సి, పిహెచ్.డి. ఇత్యాది ఉన్నత శ్రేణి విద్యార్హతలు సంపాదించిన వేలాదిమంది నవ యువకులు స్వసుఖాలు త్యజించి, పవిత్రమైన దేశ సేవకై తమను అంకితం చేసుకొనే భావంతో సంఘకార్యాన్ని చేపడుతున్నారు. ముసల్మానులను చంపేందుకో లేక దహనకాండ కొనసాగించేందుకో అయితే ఈ స్వయంసేవకులు ఇంతటి త్యాగాలకు సిద్ధపడి ముందుకు రానక్కరలేదు. కుల-మత ద్వేషాలతో కుళ్ళిపోతూ, సంకుచిత భావాలతో, స్వార్థబుద్ధితో పతనమై పోతున్న ఈ సమాజాన్ని సంస్కరసంవన్న మొనర్చి ప్రతివ్యక్తిని దైవసమానులుగా తీర్చిదిద్దాలన్న ఉదాత్తమైన ఆశయంతో వీరు త్యాగాలకు సిద్ధపడుతున్నారు. ఈ మహత్తర కార్యంలో పాలు పంచుకొనేందుకు వారి కుటుంబాలను విడిచిపెట్టి, పెద్దపెద్ద ఉద్యోగ అవకాశాలను కాలదన్ని, స్వయంగా సంపద ప్రోవుచేసుకోవాలన్న ఆశలు వీడి, సాత్వికజీవనం గడిపేందుకు సిద్ధపడి ముందుకొచ్చారు. సంఘ కార్య విస్తరణకు కావలసిన శాంతియుత వాతావరణాన్ని నెలకొల్పేందుకు లో వివిధ శాఖలలో పనిచేస్తున్న స్వయం సేవకులు దృఢ సంకల్పంతో వ్యవహరించగల మానసిక స్థితిని కల్పించాలి.'

అంతేకాదు. ఆయన ఇంకా ఇలా అన్నారు. 'విధ్వంసకాండలో జొరబడాలన్న కోర్కెతో సంఘ శాఖలలో చేరుతున్న యువకులు సంఘంలో చేరకుండా చూడవల్సిన బాధ్యత కూడా మనకుంది. ఇలాంటి వ్యక్తులు సంఘాన్ని ఎప్పుడూ అర్థం చేసుకోలేరు సరికదా, వారొనరించే అనాలోచిత కార్యాలవల్ల సంఘానికి చెడ్డ పేరు వస్తుంది.'

## ఓటమి లేనే లేదు

పంజాబ్ సమావేశాలలో గోచరమైన రేఖాచిత్రం శీఘ్రగతిని రంగులు పులుముకొంది. రోజు రోజుకు పరిస్థితి దిగజార నారంభించింది.

ఈ స్థితిలో సంఘటనా కార్యాన్ని సువ్యవస్థిత రూపంలో ఉంచి, శక్తిని సమకూర్చుకోవడం, హిందూ సమాజాన్ని రక్షించి మనోబలం కాపాడటం మాధవరావ్‌జీ ఏక కాలంలో నిర్వహించవలసిన కర్తవ్యాలయ్యాయి. వారి శక్తి, సామర్థ్యాలను పరీక్షా సమయం అది. మాధవరావ్‌జీ ఏ మాత్రం విచలితుడు కాలేదు. శిరస్సును అరిచేత పట్టుకొని ఎంతటి బలిదానానికైనా సిద్ధపడ్డారే కాని ఓటమిని తలపునకైనా రానీయలేదు.

పంజాబ్‌లో మత పరమైన విధ్వంసకాండ విలయతాండవ మాడుతోంది. ఆ సమయంలో సర్ కార్యవాహ అయిన శ్రీ బాలసాహెబ్ దేవరస్ స్వయంసేవకులను మార్గదర్శనం చేసేందుకు మార్చి 3, 1947 లో ముల్తాన్ విభాగ్ పర్యటించేందుకు వచ్చారు. పరిస్థితి అత్యంత ప్రమాదకరంగా ఉన్న స్థితిలో ఆ పర్యటన జరిగింది. అంతకు ముందు రోజు అనగా 2 మార్చినాడు మాధవరావ్‌జీ ముల్తాన్ విభాగ్ సంఘ చాలకుల సమావేశం ఏర్పాటు చేసి మాట్లాడారు. దేరా గాజీఖాం, దేరా ఇస్మాయిల్‌ఖాం, ముజఫర్‌గఢ్, మంట్ గోమరి జిల్లాలు ముల్తాన్ విభాగ్‌లో ఉన్న ప్రదేశాలే. ఏ క్షణం ఏమౌతుందో అన్నంత ఆందోళనగా ఉంది వాతావరణం. కలకత్తాలో డాక్టర్ హెడ్గెవార్‌తో పాటు చదువుకొన్న డా॥ శివదత్త పరాశర్ అప్పుడు ముల్తాన్ నగర పురపాలక సంఘ ఉపాధ్యక్షులుగా ఉన్నారు. ఎంతో ధైర్యశాలిగా అందరి మన్ననలను పొందిన వ్యక్తి ఆయన. అయినప్పటికీ ఆనాటి పరిస్థితిని పురస్కరించుకొని, 'పోలీసు బలంలో హిందువులు వున్నప్పటికీ వారు నిస్సహాయులుగానే మిగిలిపోయారు. ముస్లిం పోలీసులు క్రౌర్యానికి మారుపేరుగా తయారయ్యారు వారు శాంతిని కాపాడటంలో తోడ్పడతారనుకోవడం భ్రమ' అన్నారాయన.

ఆ నగరాని కేతెంచిన బారిష్టర్ నందలాల్, 'తమ భార్యా బిడ్డల మానాపహరణ జరుగుతుందనుకొంటే అలనాడు చిత్తోడ్ కోటలో చితి పేర్చి

కాని సిద్ధంగా ఉన్న స్త్రీలను అనుకరించ వలసినదిగా హిందువులను హెచ్చరించాల్సిన సమయం ఆసన్నమైంది. సంఖ్యా బలంలో తగినంత లేకపోయినా మనలో ప్రవహిస్తున్నది ఆ వీరమార్తాండుల రక్తమే నన్నది గుర్తుంచుకోవాలి' అన్నారు. ముల్తాన్‌లో ఉన్న హిందూసమాజపు ఆలోచనలకు అద్దంపడుతున్న మాటలివి.

## సుప్త సింహాన్ని మేల్కొల్పాలి

ఈ రకమైన అభిప్రాయాలు విన్నతర్వాత మాధవరావ్‌జీ ఇలా అన్నారు - 'భయాన్ని విసర్జించి, ధైర్యంగా వ్యవహరించమని కోరుతూ వినిపిస్తున్న సంఘ సందేశం ఇంటింటికి చేర్చడం మనందరి కర్తవ్యం. దూర దూర గ్రామాల్లో ఒక రిద్దరుగా నివసిస్తూ ఉన్న హిందూ బంధువులను తక్షణమే కలుసుకోవడమనేది ప్రథమ కర్తవ్యం. ప్రతి శాఖ నుండి ఇద్దరిద్దరు చొప్పున జట్టుగా గ్రామాలకు పంపించి, అక్కడ నివసిస్తున్న హిందువులతో సంపర్కం పెట్టుకోవాలి అలా ఈ క్రొత్త క్రొత్త గ్రామాల్లోకి వెళ్ళి సంపర్కం నెలకొల్పుకొన్నట్లయితే ఇంతవరకు సంఘం అంటే తెలియని నవ యువకులు ఎందరో మనతో కలిసి పనిచేయడానికి ముందుకొస్తారు. ఎక్కడెక్కడయితే శాఖలు వున్నాయో ఆ ప్రదేశాలలో సంఘ సంపర్కంలోనికి రాని యువకుడు అంటూ వుండకూడదు. ఇప్పుడు ముంచుకు వస్తున్న ఆపద తెలియనివారెవరూ లేరు. నవ యువకులకు మాట మాత్రంగా చెపితే చాలు-సంఘంలో వచ్చి చేరిపోతారు. ఒకసారి శాఖలకు వచ్చాక, శాఖ పద్ధతి చూశాక, అనుశాసనం, ధైర్య సాహసాలు వాటంతట అవే అబ్బుతాయి. సమాజానికి వారి అండ లభిస్తుంది.'

ఆయన ఇంకా ఇలా అన్నారు: 'తప్పకుండా రక్షణ కార్యక్రమాలు చేపట్టాలి - ఆయుధాలు లేవని భయపడి పారిపోతామా? పోరాటా

నికి ఆయుధాల కంటే ముఖ్యమైనది గుండెబలం. గుండెబలం సమకూరితే ఆయుధాలదేముంది, వాటంతట అవే వచ్చిచేరుతాయి. ధైర్యసాహసాలుంటే చేతికందిన రాయి రప్ప తుపాకుల్లా పనిచేస్తాయి. పిరికివాడు తుపాకేం పట్టు కొంటాడు? మన సమాజం ఇప్పుడు సుషుప్తిలో ఉంది. నిద్రిస్తున్న సింహాన్ని మనం మేల్కొల్పాలి.'

ఈ విధంగా మాధవరావ్‌జీ ద్వారా స్ఫూర్తి పొందిన కార్యకర్త లంతా ఎలాంటి పరిస్థితినైనా ఎదుర్కొంటాం అన్న దృఢనిశ్చయంతో తమ తమ స్థానాలకు తరలి వెళ్ళారు. ఇలాంటి సమావేశాలు పంజాబ్‌లో అన్ని విభాగ్‌లలోనూ జరిగాయి.

మాధవరావ్‌జీ ద్వారా లభించిన స్ఫూర్తిని సద్వినియోగపరచు కొని స్వయంసేవకులు తమ తమ స్థానాలకు వెళ్ళి దళాలను ఏర్పరచు కొనే సంసిద్ధులై పోయారు. వారు తమ తమ భూమికను సమర్థవంతంగా నిర్వహించడం చేత ఆ యా స్థానాలలో నేతృత్వం సహజంగానే వారి చేతు ల్లోకి వచ్చింది. ఆ నిశీధి వేళలో సమాజమంతటికి సంఘం ఒక్కటే ఆశాదీపంగా వెలసింది. ఆ రోజుల్లో అగ్రనాయకులుగా చెలామణి అవుతూ వచ్చిన వ్యక్తులు కూడా సంఘం నీడలో శరణు పొందారు. పెద్ద పెద్ద అధి కారులు కూడా సంఘాన్ని ఆశ్రయించారు.

## కాని... మేం కాంగ్రెస్ వాళ్ళం

1947 మే మాసంలో మతకలహాలు చరమసీమకు చేరుకున్న దశలో పంజాబ్ మాజీ ముఖ్యమంత్రి, ప్రసిద్ధి చెందిన కాంగ్రెస్ నాయకుడు అయిన శ్రీ గోపీచంద్ర భార్గవ మాధవరావ్‌జీని కలుసుకొని సంఘ సహా యాన్ని అర్థించారు.

మాధవరావ్‌జీ ఆయనకు ధైర్యం చెపుతూ ఇలా అన్నారు: 'మావద్ద తుపాకులు, ఫిరంగులు లేవు. కాని మా స్వయంసేవకుల కర్తృత్వం పైన పూర్తి విశ్వాసం ఉంది. వారు తమ ప్రాణాలు అర్పించి అయినా హిందూ సమాజంలోని ప్రతివ్యక్తిని కాపాడేందుకు సంసిద్ధంగా ఉంటారు.'

భార్గవజీ అన్నారు- 'కాని... మేము కాంగ్రెసు వాదులం. ముస్లింలు మమ్మల్ని శత్రువులుగా చూస్తారు, హిందూ సంఘటనవాదులు మమ్మల్ని దేశద్రోహులుగా పరిగణిస్తున్నారు!'

అప్పుడు మాధవరావ్‌జీ అన్నారు- 'భార్గవజీ! మేము మిమ్మల్ని హిందూ సమాజ ద్రోహులుగా భావిస్తున్నామని ఎవరు చెప్పారు? సంఘం పట్ల పెంచుకొన్న ఈర్ష్యాద్వేషాలతో ఈ ప్రచారాన్ని మీరే కొనసాగించారు. మాకెన్నడూ ఈ భేదభావం లేదు. హిందూ సమాజం యావత్తు మనదైన కుటుంబము. ఒక కుటుంబంలోని సభ్యులమధ్య భిన్నాభిప్రాయాలున్నప్పటికి సుహృద్భావం, ప్రేమ నెలకొని ఉంటాయి. మేము సంఘాన్ని సుసంఘటితంగా నిర్మించాము. యావత్ సమాజాన్ని ఇలాగే సంఘటిత పర్చాలని కోరుకొంటున్నాం. మీరు మాతో ఒకరు. మీకు అవమానం జరిగితే ఆ అవమానం హిందూ సమాజానికి అవమానమే. చెప్పండి, మీరు మా నుండి కోరుకొంటున్న సహాయం ఏమిటి?'

భార్గవజీ అన్నారు— 'సోదరా, ఏమి చెప్పమంటావు? ఇప్పటిదాకా మేము చెపుతున్నమాటలు చెప్పాలి కాబట్టి చెప్పాము. కాని మాకు ఇప్పుడు అర్థం అయింది. ఏది ఏమైనప్పటికి హిందూ సమాజం సంఘటితం కావడం చాలా అవసరం. ఇది మతతత్త్వం కాదు. ప్రస్తుత స్థితిలో సంఘాన్ని మేము బహిరంగంగా సమర్థించలేక పోవచ్చు...కాని-'

ఇంతలో మాధవరావ్‌జీతో మాట్లాడటానికి ఎవరో వచ్చారు. అప్పుడు భార్గవజీ మాధవరావ్‌జీని ప్రక్కకు పిలిచి చెవులలో రహస్యంగా చెప్పడం మొదలుపెట్టారు: 'ముస్లింలీగ్ వారు రహస్యంగా కొనసాగిస్తున్న కార్య కలాపాలు తెలుసుకొనేందుకు ఏదో ఒక ఉపాయం ఆలోచించకపోతే మన మంతా దిక్కులేని చావు చావవలసి ఉంటుంది.'

ఆ తర్వాత భార్గవజీ రక్షణకు, ఇంకా ఎందరో కాంగ్రెస్ నేతల రక్షణకు స్వయం సేవకులను నియుక్తం చేయడం జరిగింది. ఢిల్లీలో కూడ గాంధీజీతో పాటు అన్య నేతల రక్షణ భారం సంఘం స్వీకరించింది.

## సర్వ సంసిద్ధత

గోపీచంద్ర భార్గవ మాధవరావ్‌జీకి చాటుగా పిలిచి చెప్పిన విషయంలో ఆలోచన అప్పటికే జరిగింది. మాధవరావ్‌జీ అందుకు అవసరమైన చర్యలు తీసుకొన్నారు కూడా ముల్తాన్‌కు చెందిన సత్‌పాల్ అనే యువకుడిని 'సాదిక్ అలీ'గా మార్చి, ముస్లింలీగ్ కార్యకలాపాలను కనిపెట్టేందుకు వినియోగించారు. అతడు రావల్పిండిలో ఒక ముస్లిం వైద్యుడి దగ్గర ఉద్యోగంలో చేరాడు. ఆకుపచ్చ చొక్కా, తెల్లటి కత్తి, జిన్నాటోపీ, ఆ టోపీపైన చంద్రుడు నక్షత్రాలున్న గుర్తుగల బిళ్ళ ధరించిన ఆ యువకుడు ఎప్పటికప్పుడు మాధవరావ్‌జీకి రహస్య సమాచారం చేరవేస్తుండేవాడు. ఒకసారి మాధవరావ్‌జీ దగ్గర ఠాకూర్ రామసింగ్, పండిత్ లేఖరాజ్ శర్మ కూర్చుని ఉండగా సత్‌పాల్ ఆసక్తికరమైన సమాచారం తెలియజేశాడు.

'సాధారణంగా మహమ్మదీయులకు ఆవేశం ఎక్కువ, ఆలోచన తక్కువ అనుకుంటూ ఉంటాం. కాని లోతుగా చూస్తుంటే హిందువుల

కంటె బాగా ఆలోచించి నిర్ణయాలు తీసుకొనే వ్యక్తులు, ఒక పథకం ప్రకారం పనిచేసే వ్యక్తులు వారిలో చాలామంది ఉన్నారని తెలుస్తోంది. రావల్పిండిలో నివసిస్తున్న హిందువులపైన ఎక్కడ, ఏ విధంగా అత్యాచారాలు జరపాలి, ఎక్కడ బాంబులు ప్రయోగించాలి, కత్తిపోట్లకు అనువైన సందులు ఏవి, ఎక్కువలో ఎక్కువ ఆయుధాలు సమీకరించి పెట్టుకోవడం ఎలా, జీలం వంటి జిల్లాలలో హిందువుల పరిస్థితి ఎక్కడెక్కడ సుదృఢంగా ఉంది, అక్కడ ఉన్న ఆర్. యస్. యస్. కార్యకర్తలు ఎవరు, ఏదో ఒక నెపంతో జైలుకు పంపించేందుకుగాని. చంపించడానికి గాని వీలైన సంఖ్య ఎంత— ఇత్యాది సమాచారం ముసల్మానులు కలుసుకొన్నప్పుడల్లా లోతుగా ఆలోచించుకొంటున్నారు. మీ ఆదేశాల మేరకు (అంటే మాధవరావ్‌జీ చెప్పిన ప్రకారం) నేను ఎప్పటికప్పుడు మన కార్యకర్తలకు సమాచారం చేరవేసి హెచ్చరిక చేస్తూనే ఉన్నాను. అయితే ఎంత ప్రయత్నించినా ముందుగా సమాచారం చేరవేయలేని పరిస్థితులలో మాత్రం హిందువుల ధన, మాన ప్రాణాలకు చాలా ఎక్కువ నష్టం సంభవిస్తోంది.'

## ముసల్మానుల కూటనీతి

తన కథనాన్ని కొనసాగిస్తూ సత్‌పాల్ ఇంకా ఇలా చెప్పాడు: 'ఒకసారి అయిదారుగురు ముస్లిం యువకులు కూర్చుని మాట్లాడుకుంటున్నారు. పాకిస్తాన్ నిర్మాణానికి సంబంధించి బహుళ ప్రచారం జరగాలి. పాకిస్తాన్ నిర్మాణాన్ని సమర్థించని ముస్లిం సంస్థగాని, పాకిస్తాన్ నిర్మాణాన్ని కోరుతూ తీర్మానాలు చేసి వార్తాపత్రికలలో ప్రచారం చేయని ముస్లిం సంస్థలు కాని ఏవీ ఉండకూడదు. ఒక యువకుడు మాట్లాడుతూ 'జమాయతుల్ - ఉలేమా - ఏ - హింద్' ఇంతవరకు పాకిస్తాన్ నిర్మాణం ముస్లింల హక్కు అని తెలియజేస్తూ తీర్మానం చేయకపోవడం చికాకు

కల్గిస్తోంది అన్నాడు. దానిపైన ఇంకొకడు మాట్లాడుతూ - కాదు, కాదు వాళ్ళు ఆలా తీర్మానం చేయకూడదు అన్నాడు. ఉలేమా వాదుల్లో పాకిస్తాన్ కావాలని కోరుకోని వాడెవడూ లేడు. అందరి హృదయాల్లోనూ ఈ కోరిక ఉంది. వారు తీర్మానం చేయనంత మాత్రం చేత వచ్చిన నష్టం ఏమీలేదు. పాకిస్తాన్ అనేది కేవలం బెంగాల్, పంజాబ్ భాగాలతోనే ఏర్పడుతుంది. కాని ముసల్మానులు ఈ ప్రదేశాలలోనే కాక దేశం నలుమూలలా ఉన్నారు. హిందువులను తప్పుదోవ పట్టించేందుకు వారు విశ్వసించే ముస్లిం సంస్థను ఒకదానిని కొనసాగనివ్వాలి. హిందుస్తాన్‌లో మిగిలిపోయిన ముస్లింలలో చైతన్యం నింపి, 'ఇస్లామిక్ భావన రగుల్కొల్పుతూ వుండటానికి అలాంటి సంస్థ అవసరం. ఈ విధంగా చేయడం ద్వారా ఒక్క గుండుతో రెండు పిట్టలను కొట్టినట్లవుతుంది' అన్నాడు.

ఇలాంటి కుయుక్తులు, కుతంత్రాలు ఎన్నెన్నో!'

## ఢిల్లీ కూడా పాకిస్తాన్‌లో కలుస్తుందా

ఇంకొన్ని విషయాలు చెపుతూ సత్‌పాల్ ఇలా అన్నాడు - 'ఈ విధంగా మాట్లాడుకొంటున్న ముస్లిం యువకులు ఆంగ్లవిద్య నభ్యసించిన వారు కాకపోవచ్చు కాని రాజనీతిని, కూట నీతిని మనలోని అగ్రశ్రేణి నాయకులకంటె బాగా గుర్తెరిగిన వారని చెప్పక తప్పదు (ఇలా చెపుతుండగా ఆ అభిప్రాయాన్ని మాధవరావ్‌జీ కూడా బలపరచారు.)

ఒక రోజు నేను మా ముస్లిం వైద్యుడిని అడిగాను- 'పాకిస్తాన్ ఎంతవరకు వ్యాపించబడుతుంది? ఢిల్లీ కూడా పాకిస్తాన్‌లో భాగంగా ఉంటుందా?'

అప్పుడు ఆ వైద్యుడు- 'ఇప్పుడప్పుడే ఏమీ చెప్పలేం. అయితే ప్రస్తుతానికి పాకిస్తాన్ ఎంత చిన్నదిగా నిర్మాణం అయినప్పటికీ క్రమక్రమంగా హిందుస్తాన్ అంతా పాకిస్తాన్ కావలసిందే!' అన్నాడు.

ముస్లిం వైద్యుడు ఇంకా ఇలా అన్నాడు- 'ముసల్మానులకు ప్రజాస్వామ్యం అంతగా శోభించదు. ప్రపంచంలో గొప్పగొప్ప ముస్లిం రాజ్యాలు చాలా ఉన్నాయి. కాని ఎక్కడైనా ప్రజాస్వామ్య ప్రభుత్వం ఉందా? దీని అవసరం కూడా మనకు లేదు. నిజమైన ముస్లిం ఎవరైనా ఏర్పడబోయే పాకిస్తాన్‌కు నియంతగా ఉండి పరిపాలిస్తే చాలు. అందులోను హిందూస్తాన్‌ను జయించాల్సిన అవసరం కూడా ఉంది అహ్మద్‌షా అబ్దాలీ, నాదిర్‌షా లాంటి బంగాలు లేకపోతే హిందూస్తాన్‌ను జయించడం ఎలా?'

అతడు ఇంకా ఇలా అన్నాడు- 'ముసల్మానుల ఓట్లు తక్కువేం లేవు. ఈ ఓట్లకోసం హిందూ నాయకులు కుక్కల్లా ముస్లింల పాదాలు పట్టుకొంటారు. మన ముస్లింలీగ్ కూడా రంగంలో ఉంటుంది. సమయానుకూలంగా ముస్లింలీగు సభ్యుల ద్వారా మన కోర్కెలు తీర్చుకొంటాం. అధికారంలోకి రావడానికి హిందువుల పార్టీలు ఎన్నికై వచ్చిన ముస్లింలీగు సభ్యుల కంచాలు కడుగుతారు. మాకు అది రాలేదు, ఇది రాలేదు అంటూ ముస్లిం సభ్యులు గోల చేస్తుంటారు పాకిస్తాన్‌లో కోరలేని కోర్కెలు కూడా భారత్ ప్రభుత్వాన్నుంచి కోరగల్గుతారు. నిదానంగా మా కోర్కెలన్నీ తీరుస్తూపోతారు.'

ఆపద సమయంలో శత్రు సమాచారం తెలుసుకోవడం చాలా ముఖ్యమైన పని. సత్‌పాల్‌ను నియోగించినట్లుగానే రావల్పిండికి చెందిన జానకీదాస్‌ను లాహోర్‌లో నియుక్తం చేయడం జరిగింది. ఆయన ముగల్‌పూరాలోని ఒక కార్ఖానాలో 'జావేద్‌మియా' అన్న పేరుతో పనిలో చేరాడు. ఇలాంటి పనే చేసేందుకు శ్రీ సూరజ్‌ప్రకాశ్‌ను ముల్తాన్‌లో నియోగించారు. ఈయన అమృత్‌సర్‌లో డాక్టరుగా పనిచేస్తూ ఉండిన స్వయంసేవక్. డా॥ పరమానంద్ అనే డాక్టరు ముల్తాన్ పట్టణం విడిచిపెట్టి

పోయేటప్పుడు డా॥ సలీమ్ పేరుతో ఈ హాస్పిటల్ డా॥ సూరజ్ ప్రకాశ్ కొనుక్కొన్నారు. డా॥ సలీమ్‌గా వైద్యం ప్రారంభించారు. వీరంతా రోజు రాత్రివేళ మాధవరావ్‌జీని కలుసుకొని తాజా సమాచారం అందిస్తుండే వారు.

## నపుంసకులు వీరులైన వేళ...

ఆ రోజుల్లో పాకిస్తాన్ ఏర్పాటుకు ప్రచారం చేసే నిమిత్తం ఆలీగఢ్ ముస్లిం విశ్వవిద్యాలయం నుండి విద్యార్థులు జట్లు జట్లుగా రావల్పిండి, లాయల్‌పూర్, మియాంవాలీ, జీలమ్, వజీరాబాద్, పెషావర్, ముల్తాన్ మొదలైన పట్టణాలకు పంపబడుతూండేవారు. నినాదాలు చేస్తూ, ఉప ద్రవాన్ని సృష్టిస్తూ, హిందువులను అవమానపరుస్తూ, ఎద్దేవా చేస్తూ తిరిగే వారు. ముస్లిం విద్యార్థులు సభలు పెట్టేవారు. విషపూరిత మైన ఉప న్యాసా లిచ్చేవారు. వారి దుర్మార్గాలను ఆపు చేయడం ఎవరికీ సాధ్యపడేది కాదు. సామాన్య ప్రజానీకంలో కూడా ఈ ఆకతాయిల ప్రభావం ఎంత గానో ఉండేది. పెషావర్ వెళ్ళే దారిలో ఉన్న అటక్ స్టేషన్‌లో బండి ఆగితే అక్కడ నపుంసకుల బృందం చేరి 'ప్రియా, ప్రియా తీసుకు తీరుతాం. పాకిస్తాన్ ప్రాణప్రియం, కైద్-ఎ-ఆజం జిందాబాద్' అంటూ గీతాలు పాడారు.

అయితే సరిహద్దు గాంధీగా పేరు గాంచిన అబ్దుల్ గఫార్‌ఖాన్‌కు చెందిన ఎర్ర చొక్కాల వారు ఈ అలీఘర్ మూకలకు చక్కగా బుద్ధి చెప్పారు. కొందరికి తలకాయలు పగిలాయి. మరి కొందరు బ్రతుకు జీవుడా అని కాళ్ళకు బుద్ధి చెప్పారు.

ఇంతటి అలజడిలో కూడా మౌలికంగా నిర్వహించవలసిన సంఘ కార్యం నిర్వహించబడుతూనే వచ్చింది. ఒడిదుడుకులకు లెక్కచేయక

సంఘకార్యం సాగిపోతూనే ఉంది. అంతే ఎలాంటి పరిస్థితిలోనైనా సంఘం చేపట్టిన వ్యక్తి నిర్మాణ కార్యక్రమం కొనసాగుతూ పోవలసిందే. దేశ విభజన జరిగే ముందు ఏర్పడిన విపత్కర పరిస్థితులలో కూడా అనుకొన్న ప్రకారం సంఘ కార్యక్రమాలు యోజనా బద్ధంగా నిర్వహించబడ్డాయి. ఈ కార్యక్రమాల యోజనలో భాగంగా సంఘశిక్షావర్గ (ఓ. టి. సి.) సమయం వచ్చింది. అప్పుడు జరిగిన సంఘశిక్షావర్గ అఖండ భారతావనిలో జరిగిన ఆఖరి శిక్షావర్గ అయింది. ఆ సంఘ శిక్షావర్గ అనుకొన్న దాని కంటె ఆరురోజులు ముందుగానే ముగించవలసి వచ్చింది.

అనుకొన్న ప్రకారం 7 జూలై 1947 నాడు ఫగవాడలో సంఘ శిక్షావర్గ ప్రారంభం అయింది. కాని దానిని 12 ఆగష్టునాడు కాకుండా 6 ఆగష్టునాడే సమాప్తం చేయవలసి వచ్చింది. వివిధ ప్రదేశాల నుంచి ముస్లింల బీభత్సకాండకు సంబంధించి వార్తలు చేరుతుండటంచేత అలా చేయవలసి వచ్చింది.

దేరా గాజీఖాన్ జిల్లాకు చెందిన జాంపూర్ నుండి శిక్షావర్గకు వచ్చిన ఒక స్వయంసేవక్ తండ్రి శ్రీ తేజఖాన్ అనే ఆయన ఆ రోజు శిక్షావర్గలో ఉన్న గురూజీకి ఒక లేఖ వ్రాశారు. జాంపూర్‌కు 18 మైళ్ళ దూరంలో ఉన్న బుధ్ అనే ఒక చిన్న గ్రామంలో వంద హిందూ కుటుంబాలు ఉన్నాయి. ఒక వెయ్యిమంది ఆయుధ ధారులైన ముస్లింలు ఈ హిందూ కుటుంబాలను చుట్టుముట్టారు. అక్కడ నివసిస్తున్న చౌధురీల చుట్టూ ముస్లిం మౌల్వీలు చేరి, 'చౌధురీ జనులారా, మీరంతా ముసల్మానులుగా కాక తప్పదు. ముసల్మానులుగా మారిపోయారనడానికి నిదర్శనంగా మీమీ కుటుంబాలలోని కన్యలను ముసల్మానులకిచ్చి పెళ్ళి చేయాలి. అలా కాకపోతే ఈ వేళ ముసల్మానులం అయిపోయాం అని చెప్పి, రేపు మళ్ళా హిందువులుగానే ఉన్నాం అని మీరు అనవచ్చు. కాబట్టి ఈ పని చేసితీరాలి' అంటూ బెదిరించారు.

ఇలాంటి వార్తలు అందుతున్న తరుణంలో శిక్షావర్గ సమాప్తం చేయడం తప్పనిసరి అయింది. సమారోప ఉత్సవంలో మాధవరావ్‌జీ మాట్లాడుతూ, గురూజీద్వారా వ్యక్తీకరింపబడిన అనేక విషయాలను విపులీకరించి స్వయం సేవకుల ముందుంచారు. సంఘం ఒక శక్తివంతమైన మహాసంస్థ. అయినప్పటికీ వేల సంవత్సరాల మనపరంపరకు అనుగుణంగానే స్వయం సేవకుల ప్రవర్తన ఉండాలి. ఈక్రింది శ్లోకం స్వయంసేవకులకు వినిపించారు-

విద్యావివాదాయ, ధనం మదాయ,
శక్తిః చ యేషాం పర - పీడనాయ।
ఖలస్య సాధోః విపరీతమేతత్
జ్ఞానాయ, దానాయ చరక్షణాయ॥

వర్గ సమాప్తం అయిపోయింది. స్వయంసేవకులందరూ తమ తమ స్థానాలకు పోయి రక్షణ కార్యక్రమంలో నిమగ్నం కావడానికి బయలుదేరి వెళ్ళారు. కాని పరిస్థితి పూర్తిగా క్షీణించిన కారణంగా కొందరు స్వయం సేవకులు తమ ఇళ్ళకు కూడా చేరలేకపోయారు. మార్గమధ్యంలోనే దుండగుల దుశ్చర్యలకు గురి అయ్యారు. లాహోర్ స్వయంసేవకులు ఒక వారంరోజులపాటు రైల్వేస్టేషనులోనో, లేక ఆ సమీపంలో స్వయం సేవకుల ఇళ్ళలోనో తలదాచుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. కర్ఫ్యూ ఎత్తివేశాకనే తమ ఇళ్ళకు చేరుకోగలిగారు.

## గీటురాయికి వన్నె తెచ్చిన స్వయంసేవకులు

సమాజం అంతటి దుస్థితిపాలై దిక్కుతోచని స్థితిలో పడిపోయినప్పుడు పరిస్థితిని పూర్తిగా అకళింపుచేసుకొని అందరితోను పరస్పరానురాగపూరితమైన స్నేహసంబంధాలను నెలకొల్పుకొని పనిచేయగల

విశ్వాసపాత్రమైన నేతృత్వం ఉంటేనే ప్రజల మనోబలం చెదరకుండా కాపాడటానికి వీలుంటుంది. అలాంటప్పుడే సరియైన మార్గదర్శనం జరుగుతుంది మాధవరావ్‌జీలో ఈ సవాలును ఎదుర్కోగల లక్షణాలన్నీ పుష్కలంగా ఉన్నాయి. మాధవరావ్‌జీ పంజాబ్ ప్రాంతంలో సంఘానికి ప్రాణంలాంటివారు. పరిస్థితుల తీవ్రతను గుర్తించి సంఘ బలాన్నంత టిని కార్యరంగంలోకి దించారు. లక్షలాది హిందువులు తమ జీవితాంతం కష్టపడి సంపాదించిన ధనం, భూములు, షాపులు, భవనాలు అన్నింటిని వదిలిపెట్టి శరణార్థులుగా తరలివెళ్ళవలసిన దుస్థితి ఏర్పడింది. అన్నింటి కంటె ముఖ్యంగా వీరికి సహాయాన్ని అందించడం, సేవా కార్యక్రమాలు చేపట్టడం అనివార్యమైంది. ఇందుకుగాను మొదట్లోనే సంఘ ఆధ్వర్యంలో పంజాబ్ రిలీఫ్ కమిటీని ఏర్పాటు చేయడం జరిగింది. సంఘ స్వయం సేవకుల కానివారుకూడా హృదయపూర్వకంగా ఈ కమిటీకి సహకరించారు కొన్ని కొన్ని సందర్భాలలో రోడ్డు వెంట నడుస్తున్న స్వయం సేవకులను పిల్చి వంద, వెయ్యి, ఇంకా ఎక్కువ మొత్తాలలో డబ్బు ఇచ్చేసి, రసీదు కూడా అక్కరలేదని వెళ్ళిన వ్యక్తులు ఎందరో ఉన్నారు. స్వయం సేవకులపైన వారికి గల విశ్వాసం అంత గొప్పది.

అనేక స్థలాలలో శరణార్థుల శిబిరాలు నెలకొల్పబడ్డాయి. అమృతసర్ జిల్లాలో నగరంలోనేకాక తరన్ తరన్, అటారీ, అజనాల, పట్టే ఇత్యాది స్థానాలలో సహాయ కేంద్రాలు తెరిచారు. లాహోర్‌కి చెందిన ఖేమకరన్, గురుదాస్‌పూర్ జిల్లాలోని దేరాబాబానానక్‌లు కూడా ఇక్కడనుంచే నియంత్రణ చేయబడేవి. కేవలం ఒక్క తరన్ తరన్‌లోనే 35 వేల మంది రోజూ భోజనాలు చేస్తుండేవారు. వారికి కావలసిన గుడ్డలు, కొన్ని సందర్భాలలో డబ్బు కూడా సహాయం చేయడం జరిగేది.

ఫిరోజ్‌పూర్‌లో కూడా 35 వేల మందికి భోజనం తయారవుతుండేది. ఇది కాకుండా బాల స్వయం సేవకులు ప్రతి ఇంటా 5 లేక 10 రొట్టెలు భిక్షరూపంలో సేకరించి తెచ్చేవారు. స్త్రీలు వంట చేసేవారు. 24 గంటలు విరామం లేకుండా వంట జరుగుతూ ఉండేది. ఒక్కోసారి 15 రోజులు 20 రోజులు స్నానం కూడా చేయకుండా స్వయం సేవకులు పని చేయవలసి వస్తుండేది.

ఫాజిల్కా, అబోహర్‌లలో 30-35 వేలు, జలాలాబాద్‌లో 3 వేలు, మోగాలో 7 వేలు, తల్వాండీలో 3 వేలు, మలేట్‌లో 5 వేలు, గురుసహాయ్ మండీలో 3 వేలు, జీరాలో 3 వేల మందికి భోజనం తయ్యారయ్యేది. ఇలాంటి వంట కార్యక్రమాలు వారం రోజులు మొదలు 20 రోజుల వరకు కొనసాగేవి.

మాధవరావ్‌జీ ప్రేరణ వల్ల ప్రేమనాథ్ డోగ్రా గారి అధ్యక్షతన 'పంజాబ్ రిలీఫ్ కమిటీ' జమ్మూలో కూడా ప్రారంభించారు. 15 ఆగష్టు నుండి 10 అక్టోబర్ వరకు మూడు లక్షల రూపాయల నగదు, 50 వేల వస్త్రాలు, పదివేల పాత్ర సామగ్రి పంచిపెట్టారు. 30 వేలమంది ముస్లింలకు కూడా డబల్‌రోటీ, చాయ్ అందించి కరువా వైపునుండి సరిహద్దు దాటించి పాకిస్తాన్‌లోకి పంపించారు.

## శాంతి, విశ్రాంతి రెండూ లేవు

హిందువులను భయపెట్టడం, బెదిరించడం, దోచుకోవడం, అవమానపరచడం, మతం మార్చడం దినచర్యలైపోయాయి. క్రమక్రమంగా ఖూనీలు కూడా ప్రారంభమయ్యాయి. శేఖూపురా, రాజౌరీ (జమ్మూ)లో హత్యాకాండలు జరిగాయి. వేలాదిమంది హిందువులు హత్యకావించబడ్డారు. కొన్ని కొన్ని ప్రదేశాలలో త్రాగే నీటిలో పురుగులు తెచ్చి కలపడంలాంటి నీచమైన పనులకు పూనుకొన్నారు.

వివిధ స్థలాలలో నిత్యం జరిగే దురాక్రమణలను ఎదుర్కొవటం, అందుకుగాను సాధన సామగ్రిని సమకూర్చుకోవటం, అనాధ పిల్లలను పోషించే వారికి అప్పగించడం లాంటి పనులు సువిశాలమైన ఆ ప్రాంత మంతటా నెరవేర్చవలసి రావడంతో విసుగు విరామం లేకుండా రాత్రి అనక పగలు అనక సంచారం చేస్తూనే ఉండవలసిన పరిస్థితి ఏర్పడింది. మాధవరావ్‌జీతోపాటు ఈ పనిలో నిమగ్నమైన యువకులకు పగలు కాని, రాత్రిగాని విశ్రాంతి అనే మాట లేకుండా పోయింది.

ఎటువంటి పరిస్థితినైనా ఎదుర్కొనేందుకు హిందూ సమాజాన్ని సంసిద్ధం చేయడానికి మాధవరావ్‌జీ వివిధ స్థలాలకు వెళ్ళి నిర్విరామంగా పరిశ్రమించవలసి వచ్చింది. స్వయం సేవకులే కాకుండా సామాన్య ప్రజానీకంలోకూడా చాలా మందికి లాఠీలు, ఖడ్గాలు, పిస్తోళ్ళు ఉపయోగించడంలో శిక్షణ ఇప్పించి, ఆత్మ రక్షణకు సమాయత్తం చేశారు. అబోహర్‌లో 1947 డిశంబర్ మాసంలో ఒక సైనికశిక్షణ శిబిరం ఏర్పాటు చేశారు. దేశ విభజన కారణంగా పీడితులైన 3,000 మంది యువకులు ఈ శిబిరంలో పాల్గొన్నారు.

## పట్టువిడక నిలిచి పోరాడదాం

ముస్లింల అత్యాచారాలు పెచ్చు పెరగడంతో గ్రామాలు వదిలి ప్రజలు పారిపోవడం ప్రారంభించారు. భారతదేశానికి వెళ్ళే హిందూ బంధువులు తమ నగలు, విలువైన వస్తువులు లాహోర్‌లోని సంఘ కార్యాలయంలో ఉంచి వెళ్ళిపోయేవారు. లాహోర్‌లో ముస్లింలు పెద్ద ఎత్తున లూటీలు సాగించారు. అయినప్పటికి ధైర్యంగా తమ స్థానాలను అంటి పెట్టుకుని ఉండమని మాధవరావ్‌జీ ఆదేశించారు. స్వయం సేవకులు ఆ ఆదేశాన్ని గురుమంత్రంగా స్వీకరించి, తమ గ్రామాలలోనే ఉండి ప్రజలకు ధైర్యం చెపుతూ ఉండేవారు. కొన్ని సమయాలలో ముస్లిం మూకలను

వివిధ స్థలాలలో నిత్యం జరిగే దురాక్రమణలను ఎదుర్కోవటం, అందుకుగాను సాధన సామగ్రిని సమకూర్చుకోవటం, అనాథ పిల్లలను పోషించే వారికి అప్పగించడం లాంటి పనులు సువిశాలమైన ఆ ప్రాంత మంతటా నెరవేర్చవలసి రావడంతో విసుగు విరామం లేకుండా రాత్రి అనక పగలు అనక సంచారం చేస్తూనే ఉండవలసిన పరిస్థితి ఏర్పడింది. మాధవరావ్‌జీతోపాటు ఈ పనిలో నిమగ్నమైన యువకులకు పగలు కాని, రాత్రిగాని విశ్రాంతి అనే మాట లేకుండా పోయింది.

ఎటువంటి పరిస్థితినైనా ఎదుర్కొనేందుకు హిందూ సమాజాన్ని సంసిద్ధం చేయడానికి మాధవరావ్‌జీ వివిధ స్థలాలకు వెళ్ళి నిర్విరామంగా పరిశ్రమించవలసి వచ్చింది. స్వయం సేవకులే కాకుండా సామాన్య ప్రజానీకంలోకూడా చాలా మందికి లాఠీలు, ఖడ్గాలు, పిస్తోళ్ళు ఉపయోగించడంలో శిక్షణ ఇప్పించి, ఆత్మ రక్షణకు సమాయత్తం చేశారు. అబోహర్‌లో 1947 డిశంబర్ మాసంలో ఒక సైనికశిక్షణ శిబిరం ఏర్పాటు చేశారు. దేశ విభజన కారణంగా పీడితులైన 3,000 మంది యువకులు ఈ శిబిరంలో పాల్గొన్నారు.

## పట్టువీడక నిలిచి పోరాడదాం

ముస్లింల అత్యాచారాలు పెచ్చు పెరగడంతో గ్రామాలు వదిలి ప్రజలు పారిపోవడం ప్రారంభించారు. భారతదేశానికి వెళ్ళే హిందూ బంధువులు తమ నగలు, విలువైన వస్తువులు లాహోర్‌లోని సంఘ కార్యాలయంలో ఉంచి వెళ్ళిపోయేవారు. లాహోర్‌లో ముస్లింలు పెద్ద ఎత్తున లూటీలు సాగించారు. అయినప్పటికి ధైర్యంగా తమ స్థానాలను అంటి పెట్టుకుని ఉండమని మాధవరావ్‌జీ ఆదేశించారు. స్వయం సేవకులు ఆ ఆదేశాన్ని గురుమంత్రంగా స్వీకరించి, తమ గ్రామాలలోనే ఉండి ప్రజలకు ధైర్యం చెపుతూ ఉండేవారు. కొన్ని సమయాలలో ముస్లిం మూకలను

కాంగ్రెస్ వాదులు దేశ విభజన సందర్భంలో సంఘంద్వారా తాము పొందిన సహాయాన్ని విస్మరించలేదు. అందుచేత గాంధీజీ హత్యను సంఘానికి ఆపాదించే విష ప్రచారానికి పూనుకోలేదు.

మరో విషయం-కాశ్మీర్‌లో చాలా భాగం పాకిస్తాన్ కబంధహస్తాం నుండి విముక్తి పొంది నేడు భారతదేశంలో ఉందంటే అందుకు కారణం రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘం, దాని నేత మాధవరావ్‌జీ అనే విషయం మనం గుర్తుంచుకోవాలి.

15 ఆగష్టు 1947 నుండి 26 ఆగష్టు వరకు భారత ప్రభుత్వం వ్యవహారాలన్నీ పట్టిపట్టనట్లుగా నడిపింది. ఈలోగా పాకిస్తాన్ సైన్యాలు మూడోవంతు కాశ్మీర్‌ను ఆక్రమించేసికొని శ్రీనగర్‌ను స్వాధీనం చేసుకొనేందుకు ముట్టడి సాగించారు. భారతసైన్యాం తక్షణమే అక్కడికి చేరవలసిన పరిస్థితి ఏర్పడింది. అయితే శ్రీనగర్ విమానాశ్రయంగాని, జమ్మూ విమానాశ్రయంగాని విమానాలు దిగడానికి తగిన స్థితిలో లేవు. పూర్తిగా శుభ్రపరచి మరమ్మత్తు చేయవలసిఉంది. యుద్ధ వాతావరణం నెలకొని ఉన్న కారణంగా కూలీలు ఆ పనికి సిద్ధపడలేదు.

ఈ స్థితిలో సైన్యాధికారులు ప్రేమనాథ్ డోగ్రాగారిద్వారా మాధవరావ్‌జీని కలుసుకొని మాట్లాడారు. వెంటనే మాధవరావ్‌జీ సంఘయంత్రాంగాన్ని సమాయత్తం చేశారు శ్రీనగర్, జమ్మూ 2 విమానాశ్రయాలలోనూ రెండేసి మూడేసి వందల చొప్పున స్వయం సేవకులు పారలు, పలుగులు పట్టుకొని రెండు మూడు రోజులకు సరిపడ ఆహారం మూటలు కట్టుకొని పనిలో దిగారు. అవిశ్రామంగా 24 గంటలు పనిచేస్తూ 4 రోజుల్లో ఈ రెండు విమానాశ్రయాలను విమానాలు దిగడానికి అనువుగా తయారు చేశారు. అప్పుడు మన సైన్యం దళాలవారీగా అక్కడ దిగి యుద్ధరంగం వైపు పురోగమించాయి.

ఆ తర్వాత కూడా ఏ అవసరం వచ్చినా సైన్యాధికారులు సంఘ కార్యాలయాలకు కబురుపంపగానే కావలసిన సహాయం వెంటనే అందించ బడేది. అవసరమైనప్పుడు ఆదుకొనేది స్వయం సేవకులే అన్నది సైని కాధికారుల అనుభవం.

## మాధవరావ్ జీ పట్ల అచంచల విశ్వాసం

పంజాబ్ స్వయంసేవకులు మాధవరావ్‌జీ అంటే ప్రాణాలిచ్చేవారు. దేశ విభజన కాలంలో తమ సర్వస్వాన్ని పోగొట్టుకొని నిలవనీడలేక నిరాశ్రయులుగా భారత భూభాగంలోకి తరలి వచ్చి అనేక కష్టాలు సహించి నిలద్రొక్కుకొనే ప్రయత్నంలో ఉన్న స్వయం సేవకులు 1948లో మరో అగ్ని పరీక్షను ఎదర్కోవలసి వచ్చింది. ఆర్. యస్. యస్.ను ప్రభుత్వం నిషేధించింది. ఈ సవాలును ఎదుర్కోవలసినదిగా స్వయం సేవకులకు సంఘం పిలుపు నిచ్చింది. వెంటనే ఈ స్వయం సేవకులు అప్పటివరకు అనుభవించిన కష్ట నష్టాలను లెక్క చేయక మరో కఠిన పరీక్షకు సిద్ధమైపోయి. సత్యాగ్రహంలో పాల్గొని జైళ్ళకు వెళ్ళారు. ఇంతటి మహత్తర త్యాగాలకు సిద్ధపడిన వీరపుంగవుల కృషిఫలితంగా ప్రభుత్వం సంఘంపైన విధించిన నిషేధాన్ని తొలగించింది. అందర్నీ జైళ్ళ నుండి వదిలిపెట్టేశారు. భారతమాత సుపుత్రులైన ఈ స్వయం సేవకులు వికా వికలైన తమ సంసారాల కష్టాలను గూర్చి గుండె బాదుకోకుండా సంఘ కార్యానికి ప్రప్రథమ స్థానాన్నిచ్చి కార్యక్రమాలలో విలీనమై పోయారు. మాధవరావ్‌జీపట్ల ఈ స్వయం సేవకులకుగల ప్రేమాభిమానాలకు ఇంత కంటె నిదర్శనం ఏమి కావాలి?

# భాషాప్రయుక్త రాష్ట్రాల ముప్పు

దేశవిభజనవలన సంభవించిన గాయం పూర్తిగా మానకముందే పంజాబ్ ప్రాంతానికి మరో గట్టి దెబ్బ తగిలింది. ఈ విపత్తు బయటి నుంచి వచ్చింది కాదు. కేవలం ఆంతరంగికమైన సమస్యే. 1956 లో దేశంలో భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడ్డాయి. ఈ కాలంలోనే ప్రత్యేక పంజాబీ సుబా ఆందోళన తీవ్రస్థాయికి చేరుకొంది. పంజాబ్‌లో హిందీ మాట్లాడేవారు పంజాబీ మాట్లాడేవారు అంటూ చీలదీసే ప్రయత్నం కొనసాగింది. ఇది రోజుకురోజుకు పెరుగుతూ వచ్చింది. 1960 నాటికి పంజాబీయా లేక హిందీయా అన్న వివాదం తారస్థాయికి చేరింది. అప్పుడు మాధవరావ్‌జీ విశుద్ధ జాతీయ భావస్ఫోరకమైన తమ వాదాన్ని ప్రజలలో బాగా ప్రచారం చేసి అందరికీ అర్థమయ్యేలా కృషి చేశారు. ఆర్యసమాజం వారి ప్రభావానికి లోనై కేశధారులుగాని హిందూ బంధువులు తమ మాతృభాష 'హిందీ' అని వ్రాయించుకోడం ప్రారంభించారు. అప్పుడు పూజ్యశ్రీ గురూజీ కేవలం సమాజ హితాన్ని దృష్టిలో పెట్టుకుని ఎవరేమన్నా లెక్క చేయక ఒక ప్రకటన చేశారు. పాకిస్తాన్‌లో కలవకుండా మిగిలిపోయిన పంజాబ్ ప్రాంతంలోని కేశధారులు కాని హిందూ బంధువులందరూ తమ తమ ఇళ్ళలో పంజాబీ మాట్లాడతారు, వ్రాస్తారు. కాబట్టి వారంతా తమ మాతృభాష పంజాబీ అనే వ్రాయించాలి. అలా కానట్లయితే హిందూసమాజం చీలిపోయే ప్రమాదం ఏర్పడి, ఆ దుష్పరిణామాలు చాలాకాలం నిలిచిపోయే ప్రమాదం ఉంది అని స్పష్టంగా చెప్పారు గురూజీ. (ఈనాడు ఖలిస్తాన్ ఉద్యమం తిరుతెన్నులు చూశాక పూజ్య గురూజీ ఎంతటి దూరదృష్టితో వ్యవహరించిందీ అందరూ అర్థం చేసుకొంటున్నారు.) మాధవరావ్‌జీ ఈ భావ ప్రచారాన్ని అట్టడుగు వరకు చేర్చి, హిందూ సమాజాన్ని శక్తిశాలినిగా తయారు చేయడంలో ఎంతగానో తోడ్పడ్డారు. ఈ దిశలో వారు చేసిన కృషి కొందరికి రుచించకపోయి ఉండవచ్చును గాని, అది సమాజ

మంతటి శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని చేసిన పనే అనడంలో ఏమాత్రం సందేహం లేదు. నిజమైన దేశ నిర్మాతలు నిర్వహించే భూమిక ఇదే.

## ఎమర్జన్సీ కాలంలో ఫలించిన నేతృత్వం

26, జూన్ 1975 నాడు శ్రీమతి ఇందిరా గాంధీ తన గద్దె కాపాడు కొనేందుకు దేశంలో ఎమర్జన్సీ ప్రకటించింది. ప్రముఖ ప్రతిపక్ష నాయకులేకాక లోకనాయక్ జయప్రకాశ్ నారాయణ్, సర్‌సంఘచాలక్ శ్రీ బాబాసాహెబ్ దేవరస్ వంటి వ్యక్తులు కూడా అరెస్టు చేయబడ్డారు. ప్రజల కివ్వబడిన భావ ప్రకటనా స్వేచ్ఛ (సభలు, ప్రదర్శనలు, సమావేశాలు, ఉపన్యాసాలు ఇత్యాది) హరింపబడింది. ఆర్. ఎస్. ఎస్. పైన నిషేధం విధించబడింది.

ఈ పరిస్థితిలో నియంతృత్వాన్ని సవాలు చేసేందుకు ప్రతిపక్షాలు 'లోక సంఘర్ష సమితి'ని ఏర్పాటు చేసుకొన్నాయి. సంఘానికి ఈ సమితిలో అధికారికంగా సభ్యత్వం లేకపోయినప్పటికి ఉద్యమానికి సంబంధించిన కార్యకలాపాలన్నీ నిర్వహించవలసిన బాధ్యత సంఘానిదే అయింది. వాస్తవానికి లోకసంఘర్ష సమితికి వెన్నెముకగా పని చేసింది సంఘమే. అందుచేతనే సత్యాగ్రహంలో పాల్గొని స్వయంసేవకులు జైళ్ళకు వెళ్ళారు. మొత్తం అరెస్టయిన లక్షమందిలోనూ మూడొంతుల మందికి పైగా స్వయంసేవకులే ఉన్నారు.

స్వయం సేవకులు ఉద్యమంలో పాల్గొనేందుకు కావలసిన ప్రేరణ, ప్రోత్సాహం మాధవరావ్‌జీ నుండి లభించాయి. వారి ఆరోగ్యం పూర్తిగా చెడిపోయినప్పటికి లెక్క చేయకుండా ఉద్యమానికి ఊపిరిగా ఉండి, దేశమంతటా పర్యటించారు. జైళ్ళకు వెళ్ళిన స్వయం సేవకులు, బయట

అజ్ఞాతంగా పనిచేస్తున్న స్వయంసేవకులు దృఢమైన మనోబలంతో పని చేశారంటే దాని వెనక మాధవరావ్‌జీ కృషి ఎంతో ఉంది. అధికారికంగా లోక సంఘర్ష సమితిలో బాధ్యత లేనప్పటికి వాస్తవంగా సమితి నిర్వహణ బాధ్యతలన్నీ మాధవరావ్‌జీవే అయినాయి. అంతేకాదు, వారి వ్యూహరచన ఫలితంగా దేశంలోనే కాక అనేక ప్రపంచ దేశాలలో భారతదేశంలోని ఎమర్జన్సీకి వ్యతిరేక వాతావరణం వ్యాపింపచేయడం జరిగింది. తత్ఫలితంగా అమెరికా, ఇంగ్లాండు మొదలైన ప్రజాస్వామ్య దేశాలు శ్రీమతి గాంధీపైన వత్తిడి తెచ్చి, సాధారణ ఎన్నికలు జరిపేందుకు ఒప్పించాయి.

## అవిరామము, అవిశ్రాంతము

మాధవరావ్‌జీ తత్కాలీన పరిస్థితులను చక్కగా అంచనా కడుతూ, బాగోగులు విశ్లేషణాత్మకంగా పరిశీలిస్తూ కార్యకర్తలకు ప్రేరణనిస్తుండే వారు. ఎమర్జన్సీ పెట్టి ఒక సంవత్సరం గడిచిన తర్వాత వారు వ్రాసిన ఈ లేఖ అందుకు చక్కని ఉదాహరణ:

నాగపూర్,

ప్రియమైన స్వయంసేవక బంధువులారా! 4, జూలై, 1976

సంఘంపైన నిషేధం విధించి ఈనాటికి సరిగ్గా ఒక సంవత్సరం అయింది. ఎమర్జన్సీ ఇంకా ఒక వారంరోజుల్లో విధిస్తారనగానే దేశ శ్రేయస్సుకు భంగం కలిగించే కుతంత్రాలు, అన్యాయాలు ప్రారంభమయినాయి. ఎమర్జన్సీ అనేది ఆ పరంపరలో పరాకాష్ఠ. నిర్భీతిక దేశభక్తికీ, స్వాతంత్ర్య ప్రియత్వానికి పేరుబడ్డ సంఘం లాంటి సంస్థను అణచి వేయకపోతే దుర్మార్గానికి పాల్పడిన నియంతకు ప్రజలపై సంపూర్ణమైన అదుపు లభించదు.

సంపూర్ణ అధికారాలు తన హస్తగతం చేసుకోవడంలో నియంతృత్వ పాలకులకు పెద్ద అడ్డంకిగా నిలిచి పోయింది ఆర్. యస్. యస్. మాత్రమే అన్న విషయం గత సంవత్సర కాలంగా జరుగుతున్న సంఘటనలు ఋజువు చేస్తున్నాయి మన సంఘటనను అణచివేయడం ఎవరి తరమూ కాదు. నిషేధం విధించడం వలన సంఘ కార్యం అణచివేయబడడానికి బదులుగా సుదూర ప్రాంతాలకు శీఘ్రగతిని విస్తరించిందన్న విషయం ఆమె (శ్రీమతి గాంధి) స్వయంగా అంగీకరించింది. ఈనాడు కేవలం తనను రక్షించుకోవడానికి మాత్రమే సంఘం ఈ పోరాటం జరపడం లేదు. ప్రియాతిప్రియమైన మన జాతి జీవన విలువలు కాపాడుకొనేందుకు,స్వాతంత్ర్యాన్ని ప్రేమించే ప్రజల తరపున అగ్రగామిగా నిలిచేందుకు ఈ పోరాటం సాగిస్తోంది. అందుకు తగిన శక్తిగల సంస్థ సంఘమే అన్న విషయం కూడా అందరూ గ్రహించారు.

ప్రజలు మనపైన అపారమైన విశ్వాసం ఉంచారు. ఎన్నో ఆశలు పెట్టుకొన్నారు. ఎన్ని కష్టాలు ఎదురైనా మనపైన వారుంచిన విశ్వాసాన్ని కాపాడుకున్నాం. మనలో వేలాదిమంది స్వయం సేవకుల ఆరోగ్యం చెడి పోయింది. ఎంతోకాలం జైళ్ళలో మగ్గవలసి వచ్చింది. అంతేకాక, ఈ పరీక్షాసమయంలో అనేక కష్టనష్టాలు అనుభవించవలసి వచ్చింది. మనకు ఒక విషయం స్పష్టంగా తెలుసు. ఎన్ని కష్టాలు ఎదురైనా లెక్కచేయక తన జీవన మూల్యాల పరిరక్షణకై పోరాటం కొనసాగించి నిలిచిన జాతి మనగలుగుతుంది. పాశవిక హింసాకాండకు భయపడి తల ఒగ్గిన జాతి నశిస్తుంది. సామాన్యప్రజానీకంలో స్వాతంత్ర్య పిపాస రగల్చడానికి మనం శాయశక్తుల కృషిచేసి కృతకృత్యులమయినాం. ప్రజలపైన నియంతృత్వ పాలన రుద్దడానికి సాగించిన ప్రయత్నాన్ని తొలిరోజు నుంచే ఎదుర్కోవడానికి అవసరమైన చర్యలు దేశవ్యాప్తంగా చేపట్టడం జరి

గింది. ఈ ప్రయత్నానికి పరాకాష్ట 14 నవంబరు నాడు ప్రారంభమైన సత్యాగ్రహం. ఈ సత్యాగ్రహం వలన ప్రజానీకంలో నిర్భయత్వం, పోరాట పటిమ, జీవన మూల్యాలను పరిరక్షించుకోవాలనే తపన జాగృత మయ్యాయి. ఈ పోరాటంలో వివిధ శక్తుల మధ్య ఐకమత్యం సాధించేందుకు తగిన ప్రక్రియ ప్రారంభమైంది. మేధావులలో కూడా చైతన్యం రగిలించడం జరిగింది. ఆచార్య సమ్మేళనం ఇందుకు నిదర్శన. విశ్వ వ్యాప్తంగా ఈ సమస్యపట్ల జాగృతి కల్గించిన కారణంగా ఈ పోరాటానికి ప్రపంచ వ్యాప్తంగా నైతికబలం సమకూరింది. మరో ప్రక్కన నియంతృత్వపాలన సాగిస్తున్న దమనకాండ ఫలితంగా వారు వల్లించే సిద్ధాంతాలు బూటకమైనవనే సత్యం ప్రజలు గ్రహించారు. ఈ జాతి అత్యంత జాగరూకమైనదని, ఏ రకమైన పాశవిక శక్తి ఈ జాతిని అణచివేయ జాలదని రుజువు అయింది.

ఇవన్నీ జరుగుతున్నప్పటికి అసలు పోరాటానికి ఇది ప్రారంభం మాత్రమే అన్న సంగతి మీకు తెలుసు. రాబోయేకాలంలో ఇంతకంటె కఠిన పరీక్షల నెదుర్కొని పోరాటాన్ని తీవ్రతరం చేయవలసి ఉంటుంది. సంఘ ప్రారంభ దినాలనుండి కూడా సమస్యలను విజయవంతంగా ఎదుర్కొన్నది. కాబట్టి రాబోయే రోజుల్లో ఎదురయ్యే సమస్యలను ద్విగుణీకృత శక్తితో ఎదుర్కొగలం అనడంలో సందేహం లేదు

ఇంతకాలం ఉద్యమమే మన ఊపిరిగా భావించి ఏ లక్ష్యసాధన కొరకై ప్రయత్నిస్తున్నామో ఆ ధ్యేయప్రాప్తికొరకు మనను మనం పునరంకితం చేసుకోవలసి ఉంది. సంఘం ద్వారా మనం పొందిన సంస్కారాలకు ఇది పరీక్షాసమయం అన్న విషయం మనందరం గుర్తెరిగినదే. యావత్ సమాజం ఎంతో ఆశతో మనవైపు చూస్తున్నదన్న

సంగతి కూడా మనకు తెలుసు. ఉజ్జ్వలమైన ఈ జాతి భవిష్యత్ నిర్మాతలం మనమే అన్న తలంపుతో సమాజం దృష్టి మనపై సారించింది. మన దేశంలోని 80 కోట్లమంది ప్రజలు స్వతంత్రంగాను, ఆత్మాభిమానంతోనూ జీవించగల్గి ఉండాలా లేక బానిసలై పశువుల మాదిరిగా జీవించాలా అన్నది తేల్చుకోవలసిన సమయం ఆసన్నమైంది. అయితే అదృష్టవశాత్తు సర్వశక్తిమంతుడైన ఆ పరమేశ్వరుడు మహత్వపూర్ణమైన ఈ భూమిక నిర్వహించే సౌభాగ్యం స్వయం సేవకుల చేతుల్లో పెట్టాడు.

స్ఫూర్తిదాయకమైన మన పరంపర కారణంగా లక్ష్యసాధనలో అంతిమ విజయం మనను తప్పక వరిస్తుందన్న విశ్వాసం దృఢమైంది. రాక్షస శక్తులు విజృంభించి అన్యాయాన్ని, అధర్మాన్ని ఆశ్రయించి, తమ పాశవిక శక్తిని చాటడానికి ప్రయత్నించిన ప్రతిసారి సాత్విక శక్తులు సంఘటితమై రాక్షస శక్తులను ఓడించడం జరిగింది. ఈ పవిత్ర భూమిలో సత్యము, న్యాయము, మానవతా లక్షణాలు ఎప్పుడూ విజయాన్ని సాధిస్తూనే వచ్చాయి.

జాతి భవిష్యత్తును తీర్చిదిద్దేందుకు కష్టాలను లెక్కచేయక బలిదానాలకుకూడా సంసిద్ధంగా ఉందాం. దారిలో మన కెదురయ్యే బాధలకు ఎదురు నిల్చి నిశ్చల బుద్ధితో, దృఢ సంకల్పంతో విజయం ప్రాప్తించేవరకు అవిరామంగా, అవిశ్రాంతంగా ఉద్యమంలో ముందుకు సాగుదాం.

మాతృభూమి చరణసేవలో

తమ

**మాధవ్.**

జైళ్ళలో బంధింపబడి దేశభక్తులుగా ఉన్నందుకు శిక్ష అనుభ విస్తున్న స్వయం సేవకుల తల్లి దండ్రులు, ఇతర దగ్గర బంధువులు మనో నిబ్బరంతో ధైర్యం పీడకుండా ఉండే విధంగా వారికి మాధవరావ్‌జీ వ్రాసిన లేఖ ఉల్లేఖనీయమైంది-

పరమమిత్రశ్రీ... 26-1-1977

సప్రేమ నమస్కార్.

మకర సంక్రాంతి గడవడంతోనే చుట్టూ ఉన్న పరిస్థితిలో సమ్యక్ క్రాంతి ప్రారంభమైంది. రాజకీయ పార్టీలవారు, సామాజిక సంస్థలకు చెందిన కార్యకర్తలు అనేకులు జైళ్ళ నుండి విడుదల చేయబడ్డారు. కాని సంఘంపైన అన్యాయంగా విధించబడిన నిషేధం విషయంలో ప్రభుత్వం ఉదాసీన వైఖరి అవలంబించింది. ఇంకా వేలాది మంది స్వయం సేవకులు జైళ్ళలోనే ఉన్నారు. అయినప్పటికీ ఈ విషమ పరిస్థితిలో మనం అంతా ధైర్యంగా నిలబడాలి.

జైళ్ళలో బంధింపబడి ఉన్న మన బందువుల స్వాభిమానం, దేశ భక్తి, ధ్యేయనిష్ఠ, త్యాగనిరతి అత్యద్భుతమైనవి. వారేదో ఘోరమైన నేరం చేసి కారాగార శిక్ష అనుభవించడం లేదు. దేశభక్తిని, ప్రజా స్వామ్యంపైన నమ్మకాన్ని ప్రకటించడం, సంఘంపైన విధించిన నిషే ధాన్ని తొలగించమని ఎలుగెత్తి చాటడం- ఇవే వారు చేసిన నేరాలు. ఇవి నేరాలు అని ఎవరైనా భావిస్తే ఆ నేరాలకు మన స్వయం సేవకులు పాల్పడినందుకు మనమంతా గర్వించాలి. ఈ మహోద్దేశ్య పరిపూర్తికై అలనాడు కచుడు, ప్రహ్లాదుని మాదిరిగా- ఈనాడు స్వయం సేవకులు జైలును ఒక సాధనంగా స్వీకరించారు. ఈ సాధనచేత త్వరలోనే మన ధ్యేయం సిద్ధించి జయపతాకను ఎగురవేస్తాం. అన్యాయం, అసత్యం, నైతిక దౌర్బల్యాలకు వ్యతిరేకంగా పోరాటం సాగిస్తూ అనేక కష్టాలు సహి స్తున్న ఈ మహాత్ములకు నేను అభినందనలు తెలియజేస్తున్నాను.

ఈ బంధుజనులు కారాగారంలో ఉన్నందున మీ కుటుంబ జీవనం ఎంతగా తలక్రిందులైంది, మీరు ఎన్నెన్ని కష్టాలు ఎదుర్కోవలసి వచ్చిందీ నేను ఊహించగలను. అయితే మహోన్నతమైన ఒకానొక ఆశయసిద్ధి కొరకై మీ కుటుంబ సభ్యులు జైలులో నానాబాధలకు గురియై సాగిస్తున్న తపశ్చర్యలో మీరు కూడా పాలుపంచుకొంటున్నట్లే భావించాలి. అలా భావించుకొన్నప్పుడు ఆత్మానందకరమైన ఒకానొక అనుభూతి మీకు లభిస్తుంది అనే నమ్మకం నాకుంది.

ఈనాడు మీరు ఎదుర్కొంటున్న కఠిన పరిస్థితిలో పాలు పంచుకొని ఈ కష్టాలను అధిగమించడానికి అవసరమైన సహాయ సానుభూతులను అందించే బాధ్యత జైళ్ళ బయట ఉన్న మా అందరు స్వయం సేవకుల పైన ఉంది. ఈ కర్తవ్య నిర్వహణలో మా పక్షాన ఏవిధమైన లోపం జరగనీయమని మీకు హామీ ఇస్తున్నాను.

జైళ్ళలో బంధింపబడి ఉన్న స్వయంసేవక బంధువులకు, ఇది అగ్ని పరీక్ష. మనందరిలో స్వాభిమానం, దృఢ సంకల్పం, ఆత్మ విశ్వాసం నిలిచి ఉండేందుకు మీరు ఈ అగ్నిపరీక్షకు నిలిచి విజయం సాధించగల ఆత్మబలాన్ని ప్రసాదించవలసినదిగా శక్తిమంతుడైన ఆ పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

సర్వదా మీ సేవలో-

వినమ్రుడు,
**మాధవ్ మూళ్యే.**

## సురాజ్య నిర్మాణమేగాని అధికార వ్యామోహంలేదు

నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా సాగించే పోరాటంలో సంతులనం చెడకుండా చూసేందుకు మాధవరావ్‌జీ ఎర్రవాడ జైల్లో నిర్బంధంలో ఉన్న సర్‌సంఘచాలక్ శ్రీ బాలాసాహెబ్ దేవరస్‌తో విశ్వసనీయులద్వారా సన్నిహిత సంబంధం ఏర్పరచుకోవడమేకాక అజ్ఞాతంలో పనిచేస్తున్న శ్రీ దత్తోపంత్ ఠేంగ్డే, శ్రీ రజ్జూభయ్యాలద్వారా ఇతర రాజకీయ పార్టీల నాయకులతో మంతనాలు జరిపి వ్యవస్థిత రూపం కల్పించారు.

వాస్తవంగా చెప్పాలంటే ఈ రాజకీయ నాయకులందరిని కలిపి జనతా పార్టీ ఆవిర్భావానికి నాంది పలికి, 1977 సార్వత్రిక ఎన్నికలలో ఆ పార్టీకి ఘనవిజయం లభింపజేయడంలో పరోక్షంగానే అయినప్పటికీ మాధవరావ్‌జీ నిర్వహించిన భూమిక అత్యంత ప్రశంసనీయమైనది. ఒక విధంగా చెప్పాలంటే చక్కగా అమర్చబడిన మెట్లను ఎక్కి సునాయాసంగా జనతా పార్టీ విజయ సింహాసనాన్ని అధిష్టించింది. ఇక్కడ గుర్తుంచుకో వలసిందేమంటే, ఆ మెట్ల నిర్మాణంలో ఒక్కొక్క ఇటుకను చేర్చి తీర్చి దిద్దిన మహాశిల్పి మాధవరావ్‌జీయే.

ఆపద్ధర్మంగా ప్రజాస్వామ్య పరిరక్షణకై వారు కొనసాగించిన అవిరళ కృషి ఫలితంగా ప్రజాస్వామిక ప్రభుత్వం ఏర్పడింది. కాని వారు మాత్రం అధికార కేంద్రం నుండి గుట్టుచప్పుడు కాకుండా నిష్క్రమించారు. అంతేకాదు, ఆర్.ఎస్.ఎస్., జనతా పార్టీలు విలీనమైపోయి అధికారంలో పాలుపంచుకోవాలని శ్రీ చంద్రశేఖర్ పిలుపునిస్తే, అప్పుడు సర్ కార్యవాహ బాధ్యతలు నిర్వహిస్తున్న మాధవరావ్‌జీ అత్యంత తర్కబద్ధంగా రెండు మాటలలో సూటిగా సమాధానం చెప్పారు. సంఘం నిర్వహిస్తున్న భూమికను విశ్లేషిస్తూ వారు ఇచ్చిన సమాధానం రాజకీయ నాయ

కులకే కాదు - సంఘ స్వయం సేవకులకు కూడా ఆదరణీయము, ఆచరణీయము, చిరస్మరణీయము అయినది.

వారు ఇచ్చిన సమాధానాన్ని సంక్షిప్తంగా ఇలా వివరించవచ్చు: జాతి జీవనంలో రాజకీయాలకు ఉన్న పాత్ర చాలా ప్రధానమైనదే కాని రాజకీయాలే సర్వస్వం కావు. సామాజిక, సాంస్కృతిక, ధార్మిక, విద్యా రంగాలవలె రాజకీయరంగంకూడా జాతిజీవనంలో ఒక అంశం మాత్రమే కాబట్టి రాజకీయరంగం ఆ క్షేత్రానికి మాత్రమే పరిమితం కావాలి కాని అన్ని రంగాలను కబళించి వేసేదిగా తయారు కాకూడదు. సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక, ధార్మిక రంగాలు అదృశ్యమైపోయి, కేవలం రాజకీయరంగం మాత్రమే మిగిలిపోతే పరిస్థితి ఎలా వుంటుందో ఒక్క క్షణం ఆలోచన చేయండి. రాజకీయ నాయకులు ఒక విషయం గుర్తుంచుకోవాలి. అందరి దృష్టి కేవలం ఒక ఎన్నికల మీదనే కేంద్రీకృతమై ఉంటుందను కోవడం పొరపాటు. కొందరు వచ్చే తరాలను గూర్చి కూడా ఆలోచన చేయవలసిన అవసరం ఉంది. జాతి జీవనంలో ప్రతి అంశంలోనూ రాజకీయాలు జొప్పించాలను కోవడం పొరపాటు. అందర్నీ అధికారం కోసం పాకులాడే వారుగా మార్చాలనుకొంటే అనర్థం జరుగుతుంది. సంఘం ఒక సామాజిక, సాంస్కృతిక సంస్థ. జనతా పార్టీ ఒక రాజకీయపార్టీ. కాబట్టి జనతా పార్టీలో సంఘం కలిసిపోవాలనడం అనుచితము, హాస్యాస్పదమేకాదు అస్వాభావికము, అసంభవము కూడా.

అక్టోబర్ 16-22 హిందీ వారపత్రిక 'రవివార్' సంచికలో జనతా పార్టీలో ఆర్.యస్.యస్. విలీనం కావడం అన్న సమస్యపైన ప్రాస్తూ మృదుభాషి అయిన మాధవరావ్‌జీ వెలిబుచ్చిన భావాలు ఎంతో విలువైనవి-

ప్రశ్న : రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘం జనతా పార్టీని కబళించివేస్తుంది అన్న అనుమానాలు మిగతా నాయకులలో తల ఎత్తటానికి కారణం వారిలోని బలహీనత కాదా?

మాధ : ఈ విషయానికి సంబంధించినంతవరకు జనతా పార్టీని విచ్ఛిన్నం చేయడానికి మిగతా పార్టీలు పన్నిన కుట్రలో ఇది భాగం అనుకొంటున్నాను. జనతా పార్టీ శత్రువులు జనతా పార్టీలో చీలిక రావాలని కోరుకుంటున్నారు. పార్టీలో ఉన్న కొందరు ఈ మోసంలో ఇరుక్కుపోవడం విచారించవలసిన విషయం. సంఘం అధికారాన్ని హస్తగతం చేసుకొంటుంది అన్న ప్రచారం చేస్తున్నారు. కాని అది అబద్ధం. అదే నిజమైతే ఎమర్జన్సీ కాలంలో ఎన్నో కష్టాలను ఎదిర్చి దీక్షతో పనిచేసిన సంఘం ఎన్నికలలో ఎక్కువమందిని నిలబెడతానని పట్టుపట్టి సాధించుకోగల్గేది. కాని సంఘం అలా చేయలేదు. అధికారం కోసం పోటీ పడకుండా రాజకీయరంగం నుండి వైదొలగి సమాజ నిర్మాణ కార్యక్రమంలో లీనమైపోయింది. అంటే అధికారాన్ని పంచుకోవడానికి అవకాశం చేజిక్కినా దాన్ని వదులుకొని సామాజిక కార్యంపైన తన శక్తి, యుక్తులు కేంద్రీకరించింది. జనతా పార్టీపై ఆర్.ఎస్.ఎస్. పెత్తనం సాగిస్తోంది అనే ప్రచారం విరోధులు పన్నిన కుట్రలో భాగం మాత్రమే. జనతా పార్టీ నాయకులు ఈ మోసంలో చిక్కుకుపోరని భావిస్తున్నాను.

ప్రశ్న : మధులిమయేగారు ఆర్. యస్. యస్. జనతా పార్టీలో విలీనం కావాలని గట్టిగా కోరుతున్నారు. మీరు దీనితో ఏకీభవిస్తారా?

మాధ : ఆయనగారు సంఘం జనతా పార్టీలో లీనం అయిపోవాలని అనలేదు. వివిధ యువ సంఘాలను గూర్చి మాట్లాడుతూ అన్ని యువ సంఘాల మాదిరిగానే ఆర్. యస్. యస్. కూడా జనతా పార్టీ కనుసన్నలలో కలసిమెలసి పని చేయాలన్నారు. ఆర్. యస్. యస్. భావనను అర్థం చేసుకొని మాట్లాడిన మాట కాదిది. ఆర్.యస్.యస్. కేవలం ఒక యువ సంఘటన మాత్రమే కాదు. ఇందులో అన్ని వయస్సులవారు

పాల్గొంటున్నారు. ఇతర యువ సంఘాల మాదిరిగా ఆర్.యస్.యస్. రాజకీయాలకు సంబంధించిన శిక్షణ ఇచ్చే సంస్థ కాదు. అలాగే ఇతర యువ సంఘాల మాదిరిగా హర్తాళ్. ప్రదర్శనలు, ఘెరావోలు నిర్వహిం హించడంలో శిక్షణ ఇవ్వదు. జాతి నిర్మాణానికి, శీల నిర్మాణానికి, సాంస్కృతిక కార్యకలాపాలకు ప్రాముఖ్యం ఇచ్చి పని చేస్తుంది. ఇది జాతి వికాసానికి తోడ్పడే పని. కాబట్టి యువ సంఘటనలతో విలీనం కావడం అనేది అర్థంలేని మాట.

ప్రశ్న : మధులిమయేతో పాటు ఇంకా కొందరు నేతలు ఆర్. యస్. యస్., తరుణ శాంతిసేన, విద్యార్థి సంఘర్ష వాహిని మొదలైన సంస్థలన్నీ కలిసిపోయి పనిచేయడంవల్ల జనతా పార్టీకి బలం చేకూరుతుం దంటున్నారు. మరి మీ అభిప్రాయం ఏమిటి?

మాధ : జనతా పార్టీలో నాయకులు ఏమైనా అననీయండి. ఆ పార్టీ అధ్యక్షుడు శ్రీ చంద్రశేఖర్, ప్రధానమంత్రి శ్రీ మొరార్జీదేశాయ్ ఈ విష యంలో స్పష్టమైన అభిప్రాయము తెలియజేసినమీదట కూడా ఈ వివాదం లేవదీయడం ఆ పార్టీ క్రమశిక్షణకు ఏ మాత్రం తోడ్పడదు.

ప్రశ్న : గత ముప్పై సంవత్సరాలుగా ఆర్. యస్. యస్. పైన రాజకీయ దుమారం లేపబడుతూనే ఉంది. ప్రతిసారి ఒక క్రొత్తరూపంలో ఈ సమస్య తలఎత్తుతోంది సంఘానికి విరోధులైనవారు పనిగట్టుకొని ఈ దుమారం లేవనెత్తుతున్నారంటారా?

మాధ : మేము మా పని కొనసాగిస్తూ పోతాం. సంఘాన్ని వ్యతిరేకించే వారిని గూర్చి ఆలోచించం. సంఘానికి వ్యతిరేకంగా సాగి

స్తున్న ప్రచారాన్ని ప్రజలు ఎన్నడూ విశ్వసించలేదు. ఈ ప్రచారంవల్ల సంఘ సమర్థకులు ఎన్నడూ మోసపోలేదు. అధికార పీఠాన్ని అధిష్ఠించినవారి అడుగులకు మడుగులొత్తడం అనేది సంఘం ఎన్నడూ చేయదు. కాబట్టి వారికి సంఘం అంటే గిట్టదు. అధికార పార్టీవారు దేశంలో పని చేస్తున్న సామాజిక సంఘాలన్నీ వారి కనుసన్నలలో మెలగాలని కోరుకుంటారు. సంఘం ఆ భూమికను నిర్వహించడానికి ఎన్నడూ సిద్ధపడలేదు. సంఘ ప్రారంభం కాని, ప్రగతి కాని అధికార పీఠంలోనివారి దయా దాక్షిణ్యాల మీద ఆధారపడి జరగలేదు. సంఘం అలా ఆశించదు కూడా. సమాజమే సంఘాన్ని చేతులు చాపి ఆహ్వానించింది. అదే సంఘానికి ఉన్న బలం.

ప్రశ్న : ఒకే వ్యక్తి జనతా పార్టీలోను, ఆర్. యస్. యస్. లోను సభ్యుడిగా ఉన్నట్లయితే ద్వంద్వ ప్రభావాలకు లోను కాదంటారా?

మాధ : మనుష్య జీవితంలో అనేక విధాలైన బాధ్యతలు సంబంధాలు ఉంటాయి. తల్లి, గురువు, ధర్మం, సామాజిక ధార్మిక సంస్థలతో సంపర్కం-ఇలా అనేక సంధాలుంటాయి. వ్యక్తికి తన కుటుంబ బాధ్యత ఉన్నట్లే సంస్థ పట్ల, గురువుల పట్ల కూడా బాధ్యతలుంటాయి. ఒక్క జనతా పార్టీతోనే తప్ప మిగిలిన దేనితోనూ సంబంధం లేనటువంటి వారు జనతా పార్టీలో ఉన్నారా? అలా అయినట్లయితే ఆర్య సమాజం వారు, సిక్కులు, సర్వోదయ కార్యకర్తలు జనతా పార్టీలో ఉండటానికి వీలులేదు. నిజమే, ఆర్. యస్. యస్. లో ఉంటూ జనతా పార్టీలో పనిచేస్తున్న కార్యకర్తలు పార్టీ క్రమ శిక్షణను ధిక్కరించినట్లయితే అలాంటివారిపైన జనతా పార్టీ క్రమశిక్షణా చర్య తీసుకోవచ్చు. అయితే అది వారు ఆలోచించుకోవలసిన విషయం, మాకు సంబంధం లేదు.

ప్రశ్న : ఆర్.యస్.యస్. కేవలం సాంస్కృతిక సంస్థ కాదు, రాజకీయాలతో ముడిపడి ఉన్న సంస్థ అంటారు. మీరేమంటారు?

మాధ : రాజకీయాలు అంటే మీరిచ్చే నిర్వచనంపైన ఈచర్చ ఆధారపడి ఉంటుంది. ఆర్.యస్.యస్. రాజకీయాలలో పాల్గొనదు అంటే అధికారం కోసం జరిగే ప్రక్రియలో ఆర్.యస్.యస్. పాలుపంచుకోదని అర్థం. సంఘం పేరుతో మేము ఎన్నికలలో పోటీ చేయం. కాబట్టి ఈ ఆరోపణలో పస లేదు.

ప్రశ్న : మీకు నిజంగా ప్రజాస్వామ్యం పైన నమ్మకం ఉందా? ఒకవేళ ఉన్నట్లయితే అందరికీ మీరు ద్వారాలు ఎందుకు తెరచి ఉంచరు?

మాధ : ప్రజాస్వామ్యంలో సంఘానికి నమ్మకం ఉంది. ప్రజాస్వామ్యమనేది భావాత్మకమైన శబ్దం. ప్రజాస్వామ్యం అంటే అందరికీ తమ అభిప్రాయం ప్రకటించే హక్కు ఉంటుంది. ప్రజా జీవనంలో అన్ని రంగాలు వికాసం చెందడం, అన్ని మతాల మధ్య సౌహార్ద్రత పెంపొందటం, బహుముఖ వికాసం చెందటం. అయితే ప్రజాస్వామ్యంలో మనం ఏదైనా చేయవచ్చు అనుకోవడం పొరపాటు. మీకు ప్రజాస్వామ్యంపైన నమ్మకం ఉన్నంత మాత్రాన బయటవ్యక్తిని ఎవరినీ మీకుటుంబ సభ్యునిగా చేర్చుకోరు. ఏ క్షేత్రంలో అయితే మేము అత్యధిక కార్యం నిర్వహించ గలమో ఆ క్షేత్రంలోనే పనిచేస్తున్నాము. దేశ ప్రగతి, సామాజిక ప్రగతి, సాంస్కృతిక ప్రగతి జరగడానికి దోహదం చేసే మౌలిక ప్రజాస్వామ్య విలువలు అన్నిచోట్ల వికసింప చేయాలనేవి మా సంకల్పం.

## శరీరం కృశించింది

మాధవరావ్‌జీ ఆరోగ్యం ఎమర్జన్సీ కాలం నుంచే బాగా క్షీణించింది. ఆ కృశించిన శరీరాన్ని చూసిన వారికెవరికైనా ఒకనాడు మాధవరావ్‌జీ చక్కటి శారీరకదార్ఢ్యత కలిగినవారంటే నమ్మశక్యం కాదు.

మార్చి 1977 ఎన్నికలలో శ్రీమతి ఇందిరాగాంధీ, ఆమె పార్టీ భారీ ఎత్తున పరాజయం పాలైనాక ఎమర్జన్సీ చీకటి కాలం గతించింది. సంఘంపైన నిషేధం ఎత్తివేయబడింది. ఆ తర్వాత జరిగిన అఖిల భారత ప్రతినిధుల సభలో శ్రీ రజ్జూభయ్యాకు సర్ కార్యవాహ బాధ్యతలు ఒప్పచెప్పాక మాధవరావ్‌జీ తమ ఆరోగ్యం సంగతి పట్టించుకోవడం జరిగింది. బొంబాయిలో అనేక పరీక్షలు జరిపాక చికిత్స ప్రారంభమైంది. సర్‌సంఘచాలక్ శ్రీ బాలాసాహెబ్ దేవరస్ బొంబాయికి విచ్చేసి, వైద్యం ఎలా జరుగుతున్నది స్వయంగా అడిగి తెలుసుకొన్నారు.

## చివరి లేఖ

మాధవరావ్‌జీ బొంబాయికి చేరాక వారి వృద్ధమాత ఆయనను చూడాలని అభిలషించింది. కాని నూరు సంవత్సరాలు నిండిన వృద్ధురాలు అంత దూరం ప్రయాణం చేసి కష్టానికి ఓర్చుకోలేదని భావించి తమ అగ్రజునికి మాధవరావ్‌జీ ఒక లేఖ వ్రాశారు. దానిలో ఆమె ప్రయాణంలోని శ్రమను ఓర్చుకోలేదు కాబట్టి రానీయవద్దు అని వ్రాశారు. ఎలాగూ రెండు మాసాల తర్వాత నేనే అటు వస్తాను. అంతవరకు ఏదోరకంగా ఆమెకు నచ్చచెప్పండి అంటూ వ్రాశారు.

అయితే మాతృప్రేమ దానికి ఎలా అంగీకరిస్తుంది? తన ముద్దు కొడుకును చూసుకోవడానికి ఆమె రానే వచ్చింది. (విచారకరమైన

విషయం ఏమంటే- మాధవరావ్‌జీ తమ లేఖలో వ్రాసిన ప్రకారం ఊరికి వెళ్ళకుండానే ఇహలోక యాత్ర చాలించారు. అప్పుడు వ్రాసిన ఉత్తరమే వారి చివరి లేఖ అయింది.)

బొంబాయి నుండి మాధవరావ్‌జీని పుణె తీసుకెళ్ళి అవసరమైన చికిత్స, ఉపచర్య ప్రారంభించారు. అంత బాధలోను ఆయన సేవకై వినియోగించిన స్వయం సేవకుల క్షేమ సమాచారాలు ఎంతో ఆసక్తిగా అడిగి తెలుసుకోవడం చూస్తే ఆ స్వయం సేవకులకు ఆశ్చర్యం వేసేది. రాత్రిపూట పన్నెండు పదమూడుసార్లు ఆయన మూత్ర విసర్జనకై లేవవలసి వచ్చేది. ఆయన ఎవరి సహాయం కోరేవారుకాదు. ఎవరైనా స్వయం సేవకు లేచి సహాయం చేయబోతే, పగలంతా మీరు పనిచేసి బాగా అలసిపోయి ఉంటారు, ఇప్పుడు నిద్రపోండి. లేకపోతే మీ ఆరోగ్యం చెడిపోతుంది అనేవారు. అలాగే రాత్రి పూట పడుకోవడానికి వచ్చే స్వయంసేవకులు ఎవరైనా కప్పుకొనేందుకు దుప్పటి ఏదీ తెచ్చుకోనట్లయితే కోప్పడి 'దుప్పటి తెచ్చుకో లేకపోతే ఈ వర్షాకాలంలో గడ్డకట్టుకుపోతావు' అంటూ ఇంటికి పంపించేవారు.

## తననుగూర్చి కాదు ఇతరులగూర్చి ఆలోచనే

మాధవరావ్‌జీ తన సంగతి ప్రక్కనపెట్టి ఇతర రోగుల పరామర్శ చేస్తుండేవారు. వారి మిత్రుడు డా॥ దండేకర్ అనే ఆయన రోగగ్రస్తుడై ఆ ఆస్పత్రిలోనే చేరినప్పుడు చక్రాల బండిపైన కూర్చొని నడుపుకుంటూ ఆయన మంచం దగ్గరకు వెళ్ళి పరామర్శించారు.

ఒకసారి అక్కడ రోగుల సేవకు యుక్తురాలైన నర్సు కొడుక్కు జబ్బు చేసింది. ఆ విషయం తెలుసుకున్న మాధవరావ్‌జీ ఎంతో ఉద్విగ్న

తతో ఆ నర్సు ఆస్పత్రి డ్యూటీకి వచ్చిరాగానే ఆ అబ్బాయికి ఎలాగుందో అడిగి తెలుసుకొనేవారు. 'పిల్లవాడికి కాస్త నయంగా ఉందా? పళ్ళు అవీ బాగా పెడుతున్నారా? మందులు ఏమి వాడుతున్నారు? నా దగ్గర చాలా పళ్ళు ఉన్నాయి. కాసిని తీసికెళ్ళి మీ అబ్బాయికి పెట్టండి'- ఇలా ఎంతో ఆప్యాయంగా పలకరించేవారు!

వారు ఎంతో ఉదార మనస్కులు. ఒకసారి ఆ నర్సు మాధవరావ్‌జీ పక్క సర్దటం మర్చిపోయింది. పరుపు ఎగాదిగా అయిపోవడంతో మంచం స్ప్రింగులు గుచ్చుకుంటున్నాయి. అప్పుడు మాధవరావ్‌జీ నెమ్మదిగా ఒక స్వయం సేవకుని పిల్చి పక్క సర్దించుకొన్నారు. ఇది గమనించిన నర్సు తన పొరపాటుకు నొచ్చుకుని, మాధవరావ్‌జీ కనపరుస్తున్న పితృవాత్సల్యానికి ఎంతగానో చలించిపోయింది. మాధవరావ్‌జీని ఎప్పుడూ బాబా(నాన్న) అని పిలుస్తుండేది. అంతేకాదు, మిగతా వారితో 'ఇంతటి ఉదాత్త వ్యక్తి సేవ చేసే భాగ్యం లభించినందున నా జీవితం ధన్యమైంది' అంటుండేది. అందుచేతనే మాధవరావ్‌జీ మరణవార్త వినగానే ప్రక్కన ఉన్న స్నానాల గదికి వెళ్ళి వెక్కి వెక్కి ఏడ్చింది. ఇంటికి వెళ్ళాక కూడా ఎంతో దుఃఖించింది. మాధవరావ్‌జీ అంతిమ సంస్కారం జరుగుతున్నప్పుడు కూడా అక్కడికి వచ్చి స్వంత కూతురికంటె ఎక్కువగా విలపించింది.

మాధవరావ్‌జీ చివరి రోజుల్లో శతాధికవర్ష వృద్ధురాలైన వారి తల్లి ఆయనను చూడటానికి వచ్చింది. వస్తూ వస్తూ తీపి వంటకం వెంటతెచ్చి కుమారునికి అందించింది. దానిలో కాస్త ఎక్కువ మోతాదులోనే నోట్లో పెట్టుకొని తల్లి చేతులు పట్టుకొని ఆనందానుభూతిని పొందుతున్న మాధవరావ్‌జీ వంక 'అయ్యో, ఈయన ఆ ముద్ద మింగేస్తున్నాడే' అన్నట్లుగా చూస్తున్న నర్సుతో' ఏమ్మా, ఈ ముద్ద నాకు మింగుడు పడదని విచారిస్తున్నావా? తల్లి చేతులతో పెట్టిన ప్రసాదం తప్పక మింగుడు పడుతుంది' అన్నారు మాధవరావ్‌జీ.

మాధవరావ్‌జీకి తాను ఇంకెంతో కాలం జీవించనన్న విషయం తెలిసినట్లే అనిపిస్తుంది. శ్రీ భావ్‌రావుజీ దేవరస్ వారిని కలుసుకోవడానికి వెళ్ళి 'నేను ఇక వెళ్ళనా?' అని అడిగినప్పుడు, 'మరో రెండు రోజులు ఇక్కడే ఉండండి' అన్నారు మాధవరావ్‌జీ. ఆ మర్నాడే దేహం చాలించారు. ఆశ్చర్యకరమైన విషయం!

అంతిమక్షణం వరకు వారి మానసిక బలం కుంటుపడలేదు. స్మృతి కోల్పోవడం వంటిది ఏమీలేదు. ఆఖరు రోజున శోకతప్త హృదయులైన స్వయం సేవకులను అక్కడి నుండి దూరంగా వెళ్ళమని చెపుతూంటే, 'వారిని ఏమీ అనకండి, వారితో కలిసి ఉండాలని నాకు చాలా ఇష్టంగా ఉంది' అన్నారు మాధవరావ్‌జీ. ఆ తర్వాత వారు ఒక్కొక్కరుగా లోపలికి వెళ్ళి పరిచయం చేసుకుని బయటికి వచ్చే ఏర్పాటు జరిగింది.

ఆఖరి సారి తల్లిని కలుసుకొని ఉపచర్య కోసం లోపలికి వెళుతున్న సమయంలో మాతృమూర్తి కళ్ళ నుండి అశ్రు ధారలు ఒలుకుతుండగా మాధరావ్‌జీ మాత్రం నిశ్చలంగా ఉండిపోయారు. తన కళ్ళనుండి నీరు కారితే మాతృదేవత మరింత క్షోభిస్తుందేమో అన్న తలంపుతో సంయమనం కోల్పోకుండా నిలబడ్డారు. ఆత్మీయులందర్ని కలుసుకొన్న తర్వాతనే ఇహలోక యాత్ర చాలిస్తున్నానన్న సంతృప్తి వారికి కలిగి ఉండొచ్చు. వారి కన్నతల్లితో పాటు సర్వశ్రీ రజ్జూభయ్యా, భావురావ్‌దేవరస్, బాప్పురావ్‌మోఘే, మోరోపంత్‌పింగ్లే, బ్రహ్మదేవ్‌జీ వంటి ధ్యేయ సాధనలో సహచరులైన వారి మధ్య ఉండి దేహం చాలించడం వారికి ఒక విధమైన తృప్తి కల్గించి ఉంటుంది. (సర్ సంఘచాలకులైన శ్రీ బాబాసాహెబ్ దేవరస్ కూడా అంతకు ముందు కొద్ది రోజుల క్రితమే వారిని కలిసి వెళ్ళారు.)

సెప్టెంబర్ ౩౦ నాటి సాయంత్రం ౬ గంటలకు రక్తపీడనం ఎక్కువయి పోయి, ౬-౩౫ గంటలకు దేహం చాలించారు.

# విదేశాలలో హిందూ సంఘటనకు ప్రేరణ దాత

ప్రపంచంలో దాదాపు 125 దేశాలలో కొద్ది గొప్ప హిందువులు నివసిస్తున్నారు. అందులో 80 దేశాల వారితో ఆర్. యస్ యస్. తో సంబంధం గల సంస్థలు ఏవో ఒకటి సంపర్కం కల్గివున్నాయి ఆ ఘనత శ్రీ మాధవరావ్‌జీ మూర్త్యేకి దక్కుతుంది. వారు స్వయంగా విదేశాలకు వెళ్ళలేదు కాని, ఢిల్లీలోని చమన్‌లాల్‌జీ, ఆ తర్వాత శ్రీ లక్ష్మణ్‌శ్రీకృష్ణ భిడేద్వారా ఘనిష్టసంబంధాలు పెట్టుకొని, అంతర్జాతీయస్థాయిలో హిందువుల సంఘటన ఏర్పడటానికి దోహదం చేశారు 1975 లో శ్రీమతి ఇందిరా గాంధి దేశంలో ఆత్యయిక పరిస్థితి ప్రకటించి, రాజ్యాంగంలోని మౌలిక హక్కులలో ఒకటైన వాక్ స్వాతంత్ర్యాన్ని హరించి, వార్తా పత్రికలపై సెన్సార్ విధించి భీతావహం సృష్టించినప్పుడు విదేశాలలో ఉన్న హిందూ సంఘటన కార్యంవల్ల ప్రయోజన మేమిటో బోధపడింది. శ్రీమతి గాంధీ అరాచక పాలనను ప్రపంచ వ్యాప్తంగా ఎండ గట్టడానికి ఈ సంస్థలు ఎంతగానో తోడ్పడ్డాయి.

ఆ రోజుల్లో మాధవరావ్‌జీ కేదారనాథ్ సహానీ గారిని, మురరంద దేశాయ్‌గార్ని, డా॥ సుబ్రహ్మణ్య స్వామిని నేర్పుగా విదేశాలకు పంపించారు. వీరంతా శ్రీ భిడేగారి సహకారంతో వివిధ దేశాలలో పర్యటిస్తూ శ్రీమతి గాంధి ఎమర్జెన్సీ పేరిట సాగిస్తున్న దురంతాలకు వ్యతిరేకంగా ప్రజాభిప్రాయ సేకరణ చేశారు. అంతర్జాతీయ వత్తిడికి తట్టుకోలేక శ్రీమతి గాంధి ఎన్నికలు ప్రకటించవలసివచ్చింది. ఎన్నికలలో కాంగ్రెస్ ఘోర పరాజయం పొందింది. ఈ రెండవ స్వాతంత్ర్య పోరాటంలో జనించిన జనతా పార్టీ అధికారాన్ని హస్తగతం చేసుకున్నది.

ఈనాడు ఇంగ్లాండు, అమెరికా, ఇంకా యూరోపు దేశాలలో లక్షలాదిగా గల హిందువుల సమ్మేళనాలు జరుగుతున్నాయి. ఈలాంటి చోట

మాధవరావ్‌జీ పవిత్ర స్మృతికి ప్రణామం అర్పించాలని ఎవరికైనా అనిపిస్తుంది.

మొట్టమొదట 1946లో కొంత మంది స్వయం సేవకులు పంజాబ్ నుండి ఆఫ్రికాకు వెళ్ళారు. అలా వెళ్ళేప్పుడు వారు ఆనాటి పంజాబ్ ప్రాంత ప్రచారకులైన శ్రీ మాధవరావ్‌జీని, 'మేము అక్కడ శాఖ నడప వచ్చా? నడిపే అవసరం ఉందా?' అని అడిగారు. 'అక్కడ మనవారుంటే శాఖ నడపడంలో అభ్యంతరం ఉండదు' అన్నారు మాధవరావ్‌జీ.

శ్రీ జగదీశ్‌చంద్ర శారదాశాస్త్రి కెన్యాకు ఉపాధ్యాయులుగా వెళ్ళారు. అక్కడ మరికొంతమంది స్వయం సేవకులు కూడా ఆయనకు కనిపించారు. దానితో ఇక అక్కడ శాఖ ప్రారంభమైంది. విదేశాలలో మనవారున్న ప్రతిచోట శాఖలు పెట్టి హిందూశక్తిని సంఘటిత పరచాలనే నిర్ణయం అప్పటికింకా అధికారికంగా తీసుకోలేదు. క్రమక్రమంగా అక్కడి స్థానికులు కూడా శాఖలకు రానారంభించారు. ధ్వజం పెట్టడం, ప్రార్థన చేయడం కూడా ప్రారంభమైంది. నిదానంగా శిబిరాలు, ఐ.టి.సి. శిక్షణ తరగతులు కూడా ప్రారంభమయ్యాయి.

1947 నుంచి వ్యవస్థిత రూపంలో 'భారతీయ స్వయంసేవక సంఘ్' పేరిట కార్యం ప్రారంభమయింది. మొదటి శాఖ నైరోబీలోను, రెండో శాఖ మొంబాసాలోను ప్రారంభమయ్యాయి. జగదీశ్‌చంద్ర శారదా శాస్త్రిగారు ఎక్కడెక్కడికైతే వెళ్ళారో అక్కడ అన్నిచోట్ల శాఖలు ప్రారంభించారు.

ఆ రోజుల్లోనే బ్రహ్మదేశం (బర్మా)లో కూడా శాఖ ప్రారంభ మయింది. మొన్నటిదాకా హర్యానా బి.జె.పి. నేతగా ఉండిన శ్రీ మంగల్

సేన్ ఆ రోజుల్లో బర్మాలో ఉన్నారు. ఆయన అక్కడే పుట్టి పెరిగారు. కాబట్టి ఆ భాషా కూడా బాగా వచ్చు. కాబట్టి శాఖ ప్రారంభించడంతో ఇబ్బంది పడలేదు. కాని భారతదేశం స్వాతంత్ర్యం పొందాక రాయ బారిగా అక్కడికి వెళ్ళిన అబ్దుల్ రవూఫ్‌గార్కి మాత్రం అక్కడ శాఖ నడవడం ఇష్టం లేకపోయింది. అక్కడి ప్రభుత్వానికి ఫిర్యాదు చేశారు. అందుచేత శ్రీ మంగల్ సేన్‌ను ఆ దేశంనుండి బహిష్కరించారు. శాఖలు మూతబడ్డాయి. 1958 లో బర్మాలో పుట్టి భారతదేశం వచ్చాక అంబాలా జిల్లా ప్రచారక్‌గా ఉన్న శ్రీరాం ప్రకాశ్‌ను మాధవరావ్‌జీ అక్కడికి పంపించి మళ్ళీ క్రొత్తగా శాఖ ప్రారంభింపజేశారు.

1959 లో శ్రీ లక్ష్మణ శ్రీ కృష్ణ భిడేను కెన్యాకు పంపించారు. అక్కడ కార్యవిస్తరణ బాగా జరిగింది. భిడేజీ ఒక సంవత్సరంపాటు నిర్విరామంగా శాఖా కార్యక్రమాలు నడుపుతూ వచ్చారు. శ్రీ గురూజీ ద్వారా లభించిన మార్గదర్శక సూత్రాలను వారికి అందించి కార్యక్రమా లన్నీ సక్రమంగా జరిగేట్లు చూసి ఆయన తిరిగి వచ్చారు. ఆ తర్వాత అక్కడ కార్యక్రమాలు బాగా విస్తరించాయి.

1968 లో శ్రీ అటల్‌బిహారీ వాజపేయి తమ పర్యటనను పురస్క రించుకొని ఇంగ్లాండు వెళ్ళారు. అప్పుడు ఒకరోజు రాత్రి ఆయనను కలుసుకోవడానికి వచ్చిన విద్యార్థులు కొందరు, 'ఇక్కడ శాఖలు పెట్ట వచ్చుంటారా?' అని అడిగారు. 'ఎందుకు పెట్టకూడదు?' అన్నారు అట ల్‌జీ. వెంటనే ఆ క్షణంలోనే ధ్వజం పెట్టారు. ప్రార్థన చేశారు శాఖ ప్రారంభం అయింది. కాని శాఖాకార్యం అంతంత మాత్రంగానే జరుగు తుండేది. కాని తర్వాత కెన్యానుండి, యుగాండా నుండి నిర్వాసితులై వచ్చిన స్వయం సేవక బంధువులు ఇంగ్లాండు చేరాక 17 స్థానాలలో శాఖలు పెట్టారు.

# సర్వ సమర్పణా భావ నిర్మాణం

శ్రీ మాధవరావ్‌జీ గుణగణాలెటువంటివి, ఆయన ఎలాంటి వ్యక్తులను తయారు చేశారు, ఎలాంటి వ్యక్తుల నిర్మాణాన్ని కోరుకొన్నారు ఇత్యాది విషయాలు ఈ క్రింది ఉదాహరణలు పరిశీలిస్తే విశదమవుతాయి :

1948 లో పాకిస్తానీ దురాక్రమణదారుల ద్వారా భారత్‌పైన దాడి జరిగినప్పుడు కోటలీలో రాష్ట్రీయ స్వయం సేవక సంఘ కార్యకర్తలు ప్రదర్శించిన ధైర్య సాహసాలు మహోత్కృష్టమైనవి. ప్రభుత్వ ఆధీనంలో ఉన్న మందుగుండు సామగ్రి అయిపోయింది. అప్పుడు 20 పెట్టెలనిండా మందుగుండు సామగ్రి విమానాలపై తెచ్చి మన సైనికుల ఉపయోగార్థం క్రింద పడేశారు. కాని దురదృష్ట వశాత్తు ఆ 20 పెట్టెలు చాలా దూరంలో లోతైన ప్రదేశంలో శత్రు సైన్యం దెబ్బతీయడానికి వీలైన చోట పడ్డాయి. ఇటునుంచి అటునుంచి గుండ్ల వర్షం కురుస్తున్న ఆ తరుణంలో ఆ పెట్టెలు తెచ్చే ప్రయత్నం అంటే మృత్యు ముఖంలో జొరబడటమే. కాని ఆ నగర కార్యవాహ శ్రీ వేదప్రకాశ్ చడ్డా ఇంకో ఇరవై మంది కార్యకర్తలను తీసుకొని అక్కడున్న సైనికాధికారి దగ్గరకు వచ్చి 'ఆ పెట్టెలు మేము తెచ్చిపెడతాము' అని చెప్పడంతో ఆశ్చర్యంతో నోట మాటరాక నిలిచి పోయాడు ఆ అధికారి. ఈ ప్రయత్నంలో ఏడుగురు స్వయం సేవకులు ప్రాణాలు పోగొట్టుకొన్నారు. కాని మిగతా స్వయంసేవక వీరులు 17 పెట్టెలు భద్రంగా మోసుకొచ్చేశారు. అలా వీరస్వర్గం ప్రాప్తించిన వారిలో వేదప్రకాశ్ కూడా ఉన్నాడు. ఆ మందుగుండు సామగ్రి సహాయంతో భారత సైన్యం పెద్దపటాలం, అక్కడ వచ్చి చేరేంతవరకు శత్రువును ముందుకు రాకుండా అక్కడున్న కొద్దిపాటి సైనిక బలగం ఆపగల్గింది. కాని 'ప్రకాశ్' అస్తమించాడు. కోటలీ నుండి జమ్ముకు వెళ్ళి నివాసం ఏర్పరచుకున్న జనులు వేద ప్రకాశ్ స్మృతి చిహ్నంగా జమ్ములో 'ప్రకాశ్ నగర్'ను నిర్మించుకొన్నారు.

పంజాబ్ మొదలుకొని కాశ్మీరం వరకు, వివిధస్థానాల్లో అవిధంగా బలిదానమైన దేశభక్తుల జట్లు ముఖ్యంగా మాధవరావ్‌జీ ప్రేరణ వలన ఏర్పడినట్టివే. సంఘ స్వయం సేవకులు కానివారికి కూడా ఇది తెలుసు. యుద్ధ పరిసమాప్తి తర్వాత మాధవరావ్‌జీ జమ్మూలో ప్రేమనాథ్ డోగ్రా గారి ఇంట్లో గడిపారు. ఆ సమయంలో ఒక మిలిటరీ బ్రిగేడియర్ డోగ్రా గారిని కలుసుకొనేందుకు వచ్చారు. ఆయనకు మాధవరావ్‌జీ బాగా తెలుసు. అక్కడ మాధవరావ్‌జీని కలుసుకొన్నందుకు చాలా సంతోషపడి, 'మాధవ రావ్‌జీ! మీరు నాకంటే ఎంతో గొప్ప సేనాధిపతులు' అని కొనియాడారు. 'నాకంటె మీవద్ద ఎక్కువ మంది సైనికులున్నారు. అయితే మీ సైనికులు వేతనం తీసుకోరు. కాని సాహసంలోను, వీరత్వంలోను మాతో ఉన్న సైనికులకు ఏ మాత్రం తీసిపోరు' అన్నాడు.

## సంఘటన ఒక్కటే శరణ్యం

జమ్మూలో పేర్కొనదగిన కార్యకర్తలలో ఒకరైన శ్రీ శ్యాంలాల్ శర్మ మాధవరావ్‌జీని గూర్చి వ్రాస్తూ ఇలా అంటారు-

"భారతదేశంలో జమ్మూ - కాశ్మీర్‌కు ప్రత్యేక ప్రతిపత్తి కల్పించడానికి గాను షేక్ అబ్దుల్లా పన్నుగడ ప్రకారం భారత రాజ్యాంగంలో ఆర్టికల్ 370 జొప్పించడానికి ప్రయత్నాలు జరుగుతున్న సందర్భంలో మాధవరావ్‌జీ జమ్మూ సందర్శించారు. ఆ రాజ్యం హిందువుల చేయి జారి పోతుందనుకొన్న ఆ క్లిష్ట సమయంలో స్వయం సేవకుల నుద్దేశించి మాట్లాడుతూ 'మీ కాళ్ళపైన మీరు నిలబడి దృఢ నిశ్చయంతో పనిచేయ వలసిన సమయం ఆసన్నమైంది. ఇక కాశ్మీర్ రాజ్యంలో సంఘటిత రూపంలో పనిచేస్తే తప్ప హిందువుల అస్తిత్వం నిలబడదు' అని స్పష్టంగా చెప్పారు మాధవరావ్‌జీ."

# కర్తవ్య నిష్ఠకు మించింది లేదు

ఒకసారి టైఫాయిడ్‌తో బాధపడుతున్న ప్రచారక్ ఒకరు తన కార్యక్షేత్రాన్ని వదిలిపెట్టి లాహోర్‌కు తిరిగివచ్చారు. అప్పుడు మాధవ రావ్‌జీ క్షుభితులై ఇలా అన్నారు- 'ఒప్పుజెప్పిన పనిని వదిలేసి రావడం దేనికి? విధి నిర్వహణలో మరణిస్తే మాత్రం నష్టమేముంది? దాన్ని ఆదర్శంగా తీసుకోవడం వల్ల అక్కడి సంఘకార్యం బలపడుతుంది కదా!' మాధరావ్‌జీ ధ్యేయవాది, కర్తవ్య నిష్ఠాపరుడు.

# శతకోటి వందనాలు

బొంబాయిలోని పురాతన సంఘ కార్యకర్త శ్రీ ముకుంద్ దాప్లే శ్రీ మాధవరావ్‌జీకి సంబంధించిన మరో ఉదంతం చెప్పారు.

మాధవరావ్‌జీయొక్క అన్నగారు శ్రీ యశ్వంతరావ్ మూల్యే కుటుంబ పోషణకొరకు ఏదో ఒక పని చేపట్టాల్సిన అవసరంఏర్పడినందున ఇంకొకరి ఇంట్లో వంట మనిషిగా చేరారు. కాని అన్ని అవస్థలు పడుతూ కూడా, ఆయన మాధవరావ్‌జీ సంఘ ప్రచారక్‌గా కొనసాగడంలో ఏ రకమైన అవరోధాలు కల్పించలేదు. మాధవరావ్‌జీ చేస్తున్న సంఘ కార్యానికి అవరోధం కల్పించకపోవడమే కాదు, మాధవరావ్‌జీ స్వయంగా, 'నేనుకూడా ఏదైనా పనిచేసి మీకు తోడ్పడమంటారా?' అని అడిగినప్పుడు వెంటనే, 'ఆ పని చేయబోకు, నీవు సంఘకార్యం కొనసాగించు. అమ్మను, కుటుంబాన్ని నేను పోషిస్తాను' అన్నారు. ఆయన ఇతరుల ఇంటిలో వంటమనిషిగా పనిచేయవలసి వచ్చినందుకు అవమానంగా భావించడం గాని, న్యూనతా భావంతో కొట్టుకుపోవడం గాని జరగలేదు.

సంఘకార్యం వెనుక పునాదిరాళ్ళవలె నిలిచిపోయిన శ్రీ యశ్వంత రావ్ లాంటి వారెందరో ఉండబట్టే సంఘకార్యం ఇంత శక్తివంతంగా వ్యాప్తిచెందింది. అలాంటి మహామహులకు కృతజ్ఞతతో సతను స్తసులమై వందన మాచరించాలి. స్వసుఖాలను లెక్కచేయక పరమోన్నత ఆదర్శా నికి కట్టుబడిన ఆ మహామానస్కులకు శతకోటి వందనాలు.

జీవన లక్ష్య పరిపూర్తికి చేపట్టిన కార్య సాఫల్యతకు మాధవరావ్‌జీ జీవితాంతం కట్టుబడి అంకిత భావంతో పనిచేశారు. ఎమర్జన్సీ కాలంలో కృశిస్తున్న తమ శరీరానికి జరుగుతున్న ఘోర హానిని బుద్ధిపూర్వకంగా ఉపేక్షించి దేశం అంతా విస్తృతంగా పర్యటించారు. ఒక్కొక్కప్పుడు మరీ కదలలేని పరిస్థితి ఏర్పడితే తాత్కాలిక ఉపశమనం కోసం కాస్త విశ్రాంతి తీసుకొని మళ్ళీ బయలుదేరేవారు. అలాంటి స్థితిలో ఒకసారి డాక్టర్లు బలవంతంగా ఆయనను 15 రోజులపాటు ఎటూ కదలకుండా నివారించారు. అప్పుడు ప్రతిరోజు డాక్టర్లను దేశంలోని తాజా పరిణా మాలు అడిగి తెలుసుకొంటూ తన అశక్తతను నిందించుకొంటూ, 'ఈ శరీరం ఉండి లాభం ఏముంది? దేశం విపత్కర పరిస్థితిని ఎదుర్కొం టోంది. నేనేమో విశ్రాంతి తీసుకొంటూ కూర్చున్నాను' అనేవారు.

'శరీర మాద్యమ్ఖలు ధర్మసాధనం అన్న సూక్తిని మీరు విస్మ రించకూడదు' అంటుండేవారు డాక్టర్లు. అయినప్పటికి తనపట్ల తానే ఎంతో అసంతృప్తిని వ్యక్తపరచుకొంటూ పర్యటన ప్రారంభించడానికి తహ తహ లాడేవారు. బలవంతంగా విధించబడిన ఆ విశ్రాంతి సమయం పూర్తికాగానే ఆయన పర్యటనకు ఉపక్రమించారు. ధ్యేయ పథాన పయ నించిన ఈ బాటసారులే కొత్త తరానికి మార్గదర్శకంగా ఉండి మార్గం సుగమం చేశారు. వారి చితినుండి వెలువడిన ప్రతి అగ్నికణం మన

హృదయంలో జ్వాజ్వల్యమానమైన దేశభక్తిని రగిల్చి అనంతమైన కృషి, ఎనలేని పరిశ్రమకు బాసటగా నిలుస్తుంది. అలనాటి దధీచిని పోలిన మాధవుని అస్తికలను ఆధునిక వజ్రాయుధంగా మలుచుకొని నేటి వృత్రా సురులపైన విరుచుకుపడి ఈ పవిత్ర భూమిని నిష్కంటక మొనరిద్దాం.

మాధవరావ్‌జీని స్మరిస్తూ ఒక కవిపుంగవుడు వ్రాసిన కవితతో ముగిద్దాం—

నవయుగ చాణక్య సత్తమా
నీవు కోరుకొన్న భారతి
అభినవ చంద్రగుప్తుల కలల పంట
ఆదర్శ పథంలో తనువులొడ్డిన
లక్షలాది త్యాగధనుల స్తుతిస్తూ
లక్ష్యసాధనకై అహరహమూ తపిస్తాం

*  *  *  *

# మృదుమధుర భాషణం - వ్యక్తి నిర్మాణ చాతుర్యం

# భయ్యాజీ దాణి

హిందూసంఘటన "సంఘ" స్థాపనకొరకు 1925లో డా॥ హెడ్గేవార్ ఇచ్చిన పిలుపునందుకొని సమావేశమైన కార్యకర్తలలో ఒకరు ఈ సంస్థకు "మహారాష్ట్ర స్వయంసేవక సంఘ" అన్న పేరు పెట్టాలన్నారు. ఆయనే కొంతకాలం పోయాక "రాష్ట్రీయ స్వయంసేవక సంఘం'లో అత్యంత ఉన్నత స్థానమైన సర్‌కార్యవాహ (జనరల్ సెక్రటరీ) బాధ్యతను చేపట్టి సంఘాన్ని పటిష్టవంతంగా ముందుకు నడిపిన శ్రీ దాణీ, అంతేకాదు, గృహస్థులు కూడా సంఘ ప్రచారకులుగా పనిచేయవచ్చుననే సంప్రదాయానికి శ్రీకారం చుట్టినది కూడా వారే.

అందరిచేత ప్రేమగా భయ్యాజీ అని పిలువబడే శ్రీ ప్రభాకర్ బలవంత్ దాణి అక్టోబర్ 9, 1907లో నాగపూర్‌లోని ఉమ్రేడ్ తాలూకాలో సంపన్న కుటుంబంలో ఏకైక పుత్రుడుగా జన్మించారు. ఆ కుటుంబంలో ఆయనది ఒక రాజకుమారుని హోదా అయినప్పటికీ పొరపాటున కూడా అహంకార భావాన్ని దరి చేరనీయలేదు. సమాజ సేవకు, దేశభక్తికి పేరెన్నికగన్న తన కుటుంబానికి మరింత వన్నె తెచ్చారు శ్రీ దాణి.

భయ్యాజీ తండ్రిగారైన శ్రీ బాపూజీ దాణి లోకమాన్య తిలక్ గారికి పరమభక్తుడు. ఉమ్రేడ్ తాలూకా పర్యటించినపుడు శ్రీ తిలక్ శ్రీ బాపూజీ గారింట విడిది చేసినప్పుడు పసిబాలుడైన ప్రభాకర్‌ను తన ఒడిలోకి

తీసుకొని లాలించారు. తిలక్ మహాశయుని లాలింపులో పొందిన పరవశత్వం భయ్యాజీ జీవితంలో తుదివరకు కొనసాగింది. దీనికి తోడు నాగపూర్‌లో శ్రీ విశ్వనాథరావు కేల్కర్ ఇంట్లో ఉండి భయ్యాజీ మెట్రిక్ పరీక్ష కోసం చదివారు. శ్రీ విశ్వనాథరావు కేల్కర్ గృహం ఆ రోజుల్లో దేశభక్తులకు త్రివేణీ సంగమమే. డా॥ హెడ్గెవార్, డా॥ మూంజే, డా॥ పరంజేపే ముగ్గురూ ప్రతిరోజూ ఆ యింట కలుస్తూ వుండేవారు. వీర సావర్కర్‌కు అగ్రజుడు, డా॥ హెడ్గెవార్‌కు పరమ మిత్రుడు అయిన బాబూరావు సావర్కర్ కూడా అక్కడ తరచు కలుస్తుండేవారు.

## పూవుకు తావి అబ్బినట్లు

భయ్యాజీకి డా॥ హెడ్గెవార్ పరిచయం ఇక్కడే అయింది. భయ్యాజీ లాంటి రత్నం డా॥ హెడ్గెవార్ లాంటి సానపట్టే పనివాని దృష్టి నుంచి తప్పించుకోలేక పోయింది. డాక్టర్‌జీ నేతృత్వంలో భయ్యాజీ పులకించిపోయారు. నాగపూర్‌లో విద్యాభ్యాసం కొనసాగిస్తున్న రోజుల్లోనే సంఘ కార్య పద్ధతిని, ఆచరణ విధానాన్ని భయ్యాజీ ఆకళింపు చేసుకున్నారు. అందుచేత డాక్టర్జీకి విశ్వాస పాత్రులయ్యారు.

ఆ కుటుంబం వారితో డాక్టర్‌జీ ఎక్కువగా వచ్చి కలుస్తూ ఉండటం చేత సహజంగా ఆ యింట సంఘ అనుకూల వాతావరణం ఏర్పడింది. కుశాగ్రబుద్ధి అయిన భయ్యాజీ సంఘ స్థాపనకు దారితీసిన ఆనాటి పరిస్థితులను, సైద్ధాంతిక పరమైన ఉద్యమాలను, డాక్టర్జీ యొక్క వ్యక్తిత్వాన్ని అనతి కాలంలోనే అధ్యయనం చేయగలిగారు.

1940 లో డాక్టర్జీ భౌతికకాయం చాలించాక మొదటి ఉగాది నాడు మాట్లాడుతూ, "డాక్టర్జీ స్వయంగా సంఘస్థాన్‌లో నిలబడి శారీరక కార్య

క్రమాలు నిర్వహించేవారు, అలాగే స్వయం సేవకులు మాట్లాడుతున్న ప్పుడు అత్యంత శ్రద్ధతో ఆలకించి మరొకసారి లోతుగా ఆలోచన చేయ మని ప్రోత్సహించేవారు. డాక్టర్జీ సన్నిధిలో ఉన్న వారెవ్వరూ ఆయన దరి చేరరానంత గొప్పవాడని ఎప్పుడూ భావించేవారు కారు. ఎవరికివారు యింకో రెండు అడుగులు వేస్తే ఆయనను చేరుకోవచ్చు నన్నంత సమీపంలో ఉండేవారు" అన్నారు శ్రీ దాణి.

## నాగపూర్‌కు వెలుపల మొట్ట మొదటి శాఖ - గురూజీని వెదికి పట్టుకోవడం

భయ్యాజీ నాగపూర్‌లోనే ఉన్నత విద్యను అభ్యసించవచ్చు. కాని డాక్టర్జీ అభిమతానికి అనుగుణంగా కాశీ విశ్వవిద్యాలయంలో చేరారు. అక్కడకు చేరాక భిన్నభిన్న ప్రాంతాల నుండి వచ్చిన వారిని పరిచయం చేసుకుని శాఖ ప్రారంభించారు. నాగపూర్‌కు వెలుపల మరో చోట స్థాపించ బడిన ప్రప్రథమ శాఖ యిదే. ఆ విధంగా సంఘ కార్యవిస్తరణలో భయ్యాజీ అగ్రగామి అయ్యారు. ఆ తర్వాత ఐదారేండ్లలో శ్రీ భావురావ్ దేవరస్, శ్రీ వసంతరావ్ ఓక్, శ్రీ రాజాబావ్ పాతురక్కర్, యింకా యితర యువకులు, ఉత్తరప్రదేశ్, ఢిల్లీ, పంజాబ్ ప్రాంతాలకు చదువు కునేందుకు వెళ్ళి, చదువుతోపాటు సంఘ కార్యం చేపట్టారు.

శ్రీ గురూజీని సంఘ సంపర్కంలోనికి తేవటం అన్నది కాశీలో ఉండగా భయ్యాజీ చేసిన అతి గొప్ప కార్యం. యం.యస్.సి. పూర్తి అయి నాక పరిశోధన కొరకై నాగపూర్‌కు చెందిన మాధవ సదాశివ గోల్వా ల్కర్ కాశీలో వుండిపోయారు. ఈ కాలంలోనే భయ్యాజీ ఆయనను సంఘ సంపర్కంలోనికి తెచ్చారు.

కాశీ విశ్వవిద్యాలయంలో అధ్యాపక వృత్తి స్వీకరించిన శ్రీ గురూజీని సంఘ సంపర్కంలోనికి తెచ్చాక ఆయనలో వున్న వాక్పటిమను గుర్తించి, చక్కటి ఉపన్యాసా లిప్పించి, సంఘ కార్యానికి దోహదం చేయటమేకాకుండా, ఆయన ద్వారా శ్రీ మదనమోహన్ మాలవ్యా గారిని మెప్పించి కాశీ విశ్వవిద్యాలయ ఆవరణలోనే సంఘ కార్యాలయం పెట్టుకునేందుకు అనుమతి పొందిన ఘనత కూడా భయ్యాజీకి దక్కింది.

భయ్యాజీ కృషి వలన శ్రీ గురూజీ విశ్వవిద్యాలయ శాఖ ప్రముఖ్ అయ్యారు. ఈ శాఖకు అవసరమైన ఘోష్ పరికరాలన్నీ శ్రీ గురూజీయే సమకూర్చారు.

భయ్యాజీ, ఆద్యసర్ సంఘ చాలకులు శ్రీ హెడ్గెవార్ కాశీకి విచ్చేసి నప్పుడు భాపూరావ్ దాణ్లేగారి నివాసం "జమఖండేభవన్" లో గురూజీతో కలుసుకునే ఏర్పాటు చేశారు అత్యంత ప్రభావశీలమైన గురూజీ వ్యక్తిత్వం డాక్టర్జీని ఆకర్షించింది. నాగపూర్‌లో జరిగే విజయదశమి ఉత్సవంలో పాల్గొనేందుకు గురూజీని ఆహ్వానించారు. గురూజీ యొక్క సహాధ్యాయి డా॥ సద్‌గోపాల్‌జీని కూడా ఆహ్వానించారు. గురూజీ నాగపూర్ కార్యక్రమానికి వెళ్ళారు. ఆ తర్వాత క్రమక్రమంగా సంఘానికి దగ్గరయ్యారు.

అప్పుడప్పుడు నాగపూర్‌కు, ఉమరేడ్‌కు వచ్చినపుడు భయ్యాజీ గురూజీ ప్రతిభా విశేషాలు ఉగ్గడిస్తూ, ఆయన్ను సంఘ కార్యక్రమాలలో ఎలా వినియోగించుకోవచ్చో డాక్టర్జీతో చర్చిస్తూండేవారు.

గురూజీ భయ్యాజీకి ఎంత సన్నిహితులయ్యారంటే సంఘ కార్యాలలో నిమగ్నమైపోయి భయ్యాజీ బి.ఏ. చదువు సంగతి మర్చిపోయారని

గ్రహించి రాత్రింబవళ్ళు పరీక్ష కోసం కృషి చేసేట్లు చేశారు. తత్ఫలితంగా భయ్యాజీ మంచి మార్కులు తెచ్చుకుని బి.ఎ. పరీక్ష పాసయ్యారు.

వారణాసి శాఖ ప్రారంభానికి సంబంధించిన కొన్ని విశేషాలను కూడా ఈ సందర్భంలో గుర్తు చేసుకోవడం బాగుంటుంది.

ఉత్తరప్రదేశ్‌లో రాష్ట్రీయ స్వయం సేవక సంఘ కార్యక్రమాలు ప్రప్రథమంగా లక్నోలో 1937 లో ప్రారంభించడం జరిగిందనే అభిప్రాయం చాలా మందికి ఉంది. కాని ఈ మహా కార్యం 1937 కంటె ఎంతో ముందుగా భారతదేశ సాంస్కృతిక రాజధానిగా ఎన్నదగిన కాశీలో ప్రారంభమైంది. ఆ ఘనత సాక్షాత్తూ సంఘ నిర్మాత డా॥ హెడ్గెవార్‌కు దక్కింది. మాననీయులు మదన మోహన మాలవ్యా,వీర సావర్కార్ అన్నగారు బాబూరావు సావర్కార్‌ల ద్వారా ఈ పని జరిగింది.

బ్రిటిష్ వారి జైళ్ళ నుండి బయటపడ్డ తర్వాత బాబూరావు సావర్కార్ చాలా అస్వస్థులైనారు. హిందూ మహా సభ కార్యకలాపాలలో వారికున్న పరిచయాన్ని పురస్కరించుకుని మాలవ్యాజీ కాశీలో వున్న ప్రముఖ వైద్యులు త్రయంబక శాస్త్రి గారి వద్ద వైద్యం చేయించుకునేందుకు గాను, బాబూరావు సావర్కార్ గార్ని ఆహ్వానించారు. కాశీకి వచ్చాక కాశీ విశ్వవిద్యాలయంలో ఉన్న మదన మోహన మాలవ్యా గారి నివాసంలోనే బాబూరావు గారి బస ఏర్పాటు చేయబడింది. ఆరోగ్యం బాగా క్షీణించటం చేతను, డాక్టర్ గారి యిల్లు విశ్వవిద్యాలయానికి చాలా దూరంగా వుండటం చేతను, బాబూరావు గారి బస "జమూఖండి భవన్"కు మార్చబడింది. మహా రాష్ట్రలో జమాఖండి అనే ఒక చిన్న జమిందారీ కుటుంబ నిర్వాహణలో యీ భవనం ఉండేది.

జమాఖండి భవన్‌కు చేరాక వ్యవస్థాపకులైన శ్రీ వెంకటేష్ నారాయణ దామ్లే (భావూరావు) తో బాబూరావుకు పరిచయం అయ్యింది. భావూరావు దామ్లేగార్కి బారిష్టర్ సావర్కార్‌తో అంతకుముందే పరిచయం ఉంది. అందుచేత సహజంగా బాబూరావుతో క్రమ క్రమంగా స్నేహం పెరిగింది.

శ్రీ బాబూరావు సావర్కార్ వారణాసిలోని ధార్మిక, సాంస్కృతిక వాతావరణంతో బాగా ప్రభావితులైనారు. నాగపూర్‌లోని రాష్ట్రీయ స్వయం సేవక సంఘాన్ని పోలిన సాంస్కృతిక కార్యక్రమం అక్కడ కూడా ప్రారంభం కావాలని కోరిక జనించింది. మదనమోహన మాలవ్యా గారితో సంప్రదించగా అయన ఒప్పుకోవడమే కాదు, చాలా ఆనందించారు కూడా. బాబూరావు, డా॥ హెడ్గెవార్‌కు మధ్య సత్సంబంధాలు ఎప్పటినుంచో ఉన్నాయి, కాబట్టి డాక్టర్జీని వారణాసికి ఆహ్వానించారు. ఇది 1927 నాటి మాట.

అనుకున్న ప్రకారం డాక్టర్జీ వారణాసి వచ్చారు. వారికి "జమాఖండి భవనం" లోనే విడిది ఏర్పాటు చేశారు. డాక్టర్జీ అక్కడ ఉన్న 15 రోజులలో శ్రీ భావూరావు దామ్లేతో స్నేహం ఏర్పర్చుకున్నారు. బాబూరావు సావర్కార్ గారి ఆశీస్సులు అందుకు తోడైనాయి. మాలవ్యాజీ అనుజ్ఞతో జమాఖండి భవనంలోనే శ్రీ భావురావు దామ్లేతో సహా మరి కొందరు యువకులను, బాలురను చేరదీసి సంఘదీక్ష ఇచ్చి శాఖ ప్రారంభించారు. అందరూ ప్రతిజ్ఞ, ప్రార్థన మరాఠీలోనే చేశారు.

కొంతకాలం పోయాక ఈ శాఖ ధన దాన్యేశ్వర్ మందిరంలోనికి మార్చబడినది. ఆ తర్వాత మూడు మాసాలకు విశ్వవిద్యాలయ శాఖ ప్రారంభం అయింది.

కాశీలో డిగ్రీ పరీక్ష పూర్తి చేసుకుని భయ్యాజీ నాగపూర్ చేరాక లా పరీక్షకు చదవడం ప్రారంభించారు. ఈ కాలంలోనే గురూజీ కూడా నాగపూర్ చేరారు. భయ్యాజీతోపాటు ఆయన కూడా 'లా' చదవడం ప్రారంభించారు. భయ్యాజీ 'లా' చదివి వకీలు అయ్యారే కాని ఇటు సంఘ కార్యం, అటు ఉమ్మేడ్‌లో ఇంటి పనుల వత్తిడి కారణంగా వకీలుగా ప్రాక్టీస్ ఏమీ చేయలేకపోయారు.

లా చదువుతున్నప్పుడు భయ్యాజీ నాగపూర్‌లోని గిరిపేట్‌లో ఒక ఇల్లు అద్దెకు తీసుకున్నారు. అది ఒక రకంగా ధరమ్‌పేట బస్తీ కార్యాలయంగా మారి పోయింది. భయ్యాజీతో గల స్నేహం కారణంగా గురూజీ ఇక్కడికి తరచూ వస్తూండేవారు. డాక్టర్‌జీ కూడా వస్తూండేవారు. ఇక చెప్పేదేముంది? ఎప్పుడూ అక్కడి వాతావరణం ఉత్సాహ భరితంగా వుండేది. కార్య సరళికి సంబంధించి కొనసాగే ఆలోచనలకు ఆలవాలంగా ఉండేది (ఆ రోజుల్లో నాగపూర్‌లో ఇలాంటి కేంద్రాలు ఎన్నో కనిపిస్తుండేవి. ఈ కేంద్రాలన్నింటితోనూ డాక్టర్‌జీ సన్నిహిత సంబంధాలుండేవి.) ఇలాంటి సమావేశాలలో అనేక మంది క్రొత్తవారితో పరిచయమయ్యేది. వారందరూ క్రమక్రమంగా పరిచయం చేయబడుతూ సంఘానికి దగ్గరవుతూ వుండేవారు. ఇలాంటి సమావేశాలలో సంభాషణా చతురత గల భయ్యాజీ ప్రముఖ పాత్ర వహిస్తూ ఉండేవారు.

వాస్తవానికి గురూజీ కాశీ నుంచి వచ్చేశాక ఆయనతో సన్నిహిత పరిచయం ఏర్పరచుకునే బాధ్యత భయ్యాజీకి అప్పగించబడింది. గురూజీని అధికాధిక సమయం సంఘ కార్యంలో నిమగ్నం చేయడానికి అనేక కార్యక్రమాలు ఏర్పాటు చేయమనేవారు భయ్యాజీ. గురూజీ సర్ సంఘచాలక్‌గా నియుక్తులు కావటానికి భూమిక ఈ కార్యక్రమాలే అని చెప్పాలి.

గురూజీ సర్ సంఘ చాలక్‌గా నియుక్తులైనప్పుడు ఒక దశాబ్దం పాటు తాను పడిన శ్రమ ఫలించిందన్న సంతోషాన్ని అనుభవించారు భయ్యాజీ. ఇక గురూజీ యేమో భయ్యాజీ యొక్క స్నేహ. సహకారాంతో కార్యభారం ఎంత గొప్పదైనా మోయవచ్చు ననుకొన్నారు.

స్నేహితులను చేసుకోవడంలో భయ్యాజీకి గల నేర్పు అనితర సాధ్యం. నాగపూర్‌లో సంఘ స్వయం సేవకులే కాక ఇతరులు అనేకులు భయ్యాజీ స్నేహ బృందంలో ఉండేవారు. అలాంటి మిత్రులలో కాంగ్రెస్ వారైన శ్రీయుత దేవదయాళ్‌గుప్త, శంకరరావు దాణి, కమ్యూనిస్టు పార్టీ వాడైన భూకేన్ ముఖర్జీ, బాలాజీ హుద్దార్, ఇంకా హిందూ మహా సభకు చెందినవారు,విప్లవోద్యమంలో పాల్గొనె యువకులు అనేకమంది ఉన్నారు. కేవలం వారితోనే కాక, వారి కుటుంబ సభ్యులతో కూడా భయ్యాజీకి మంచి పరిచయాలు వుండేవి.

## ఒక కాలు గ్రామంలో-మరొక కాలు పట్నంలో

వాస్తవానికి భయ్యాజీ కాశీనుండి తిరిగివచ్చాక ఒక కాలు ఉమ్రేడ్ లోనూ, ఒక కాలు నాగపూర్‌లోనూ అన్నట్లుండేవి ఉదయం స్నానాది కాలు ముగించుకుని యింటినుండి బయటపడితే మళ్ళీ రాత్రి బాగా పొద్దు పోయాక యింటికి చేరేవారు. ఒక్కోసారి అటునుండి అటే నాగపూర్ వెళ్ళిపోయాక అక్కడినుండి కబురు పంపుతుండేవారు.

వివాహానంతరం కూడా వారి దినచర్యలో ఏమీ మార్పు రాలేదు. వారి సతీమణి ఎప్పుడూ అంటూండేది - "మీరు ఎక్కడ తిరిగినా ఫర్వా లేదు కాని, కనీసం కులాచారాలకు సంబంధించిన పనులన్నీ చేస్తూంటే ఫర్వాలేదు." ఆమె కోరికను దృష్టిలో పెట్టుకుని భయ్యాజికి కార్యక్రమాలు

ఏర్పాటు చేసేటప్పుడు, శ్రీ గురూజీ ఆ ఆచారాలకు అడ్డంకాని రీతిలో కార్య క్రమాలు ఏర్పాటు చేస్తూండేవారు. సాధ్యమైనంతవరకూ కుటుంబ సభ్యులకు మనస్తాపం కలిగించకుండా కార్యక్రమాలు ఏర్పాటు చేసుకున్నప్పుడే వారి సహకారం లభిస్తుంది.

గురూజీ సర్ సంఘ చాలక్ బాధ్యత స్వీకరించిన తొలిరోజుల్లో వారితో వ్యక్తిగత విషయాలు ముచ్చటించడానికి స్వయంసేవకులు సంకోచించేవారు. అలాంటి విషయాలు స్వేచ్ఛగా భయ్యాజీతో చెప్పుకునేవారు. వారి అభిప్రాయాలు ఆ విధంగా గురూజీకి చేరుతుండేవి.

## మనస్సులు కలిపివుంచే వారధి శ్రీ భయ్యాజీ

భయ్యాజీ పేరుకు గృహస్థే కాని ఆయన సమయం అంతా సంఘ కార్యంలో ఎదురవుతున్న సమస్యలు తీర్చడానికి, విభేదించిన కార్యకర్తలకు నచ్చచెప్పడానికి సరిపోతుండేది. అందుకే ఆయనను మనస్సులను అతికించే సేతువు అంటూండేవారు. ఎలాంటి అభిప్రాయాలనైన నిస్సంకోచంగా విని, ఆదర్శానికి, ఆచరణకు మధ్య సమన్వయం సాధించే మార్గం సూచిస్తూ ఉండేవారు. ఈ విధమైన కార్యాన్ని జీవితాంతం నెరవేరుస్తూ వచ్చారు. సమస్యలను నాన్చడం ఆయనకెప్పుడూ ఇష్టం ఉండేదికాదు.

సమాజ సంఘటనాకార్యంలో మానవ స్వభావం అతి ముఖ్యమైన పాత్ర వహిస్తుంది. పదిమంది కలసి పనిచేసేప్పుడు వ్యక్తిగతమైన ఇష్టాయిష్టాలను ఇతరులతో కలిసి పనిచేయడానికి ప్రతిబంధకం కాని రీతిగా మలచుకొని ముందుకు పోయినప్పుడే పనిలో ఉత్సాహం పెరుగుతుంది, సంఘటన బలపడుతుంది, లక్ష్యంవైపు పయనం సాఫీగా సాగుతుంది. అయితే పుట్టుకతో పుట్టిన బుద్ధి పుడకలతో కాని పోదు అన్న సామెత

ఒకటి వుంది. సహజంగా వున్న స్వభావాన్ని మార్చుకోవడం కొన్ని సందర్భాలలో కష్టమే అవుతుంది. అటువంటప్పుడు, ఉడుకు రక్తం పొంగి చిన్న చిన్న ఘర్షణలు కూడా సంభవిస్తుంటాయి. ఇలాంటి సందర్భాలు ముఖ్యంగా సంఘ కార్యాలలో ఒడిదుడుకులు ఎదురైనప్పుడు, అనుకున్న పనికి అడ్డంకులు ఎదురు అవుతున్నప్పుడు ఎక్కువగా బయట పడుతూంటాయి.

దేశ విభజన కాలంలోను, సంఘం పైన 1948 లో విధించిన నిషేధం కాలంలోనూ యిలాంటి సందర్భాలు కొన్ని ఎదురైనాయి. కొందరు కాకలు తీరిన కార్యకర్తలు కూడా సమస్యల భారానికి చలించి, సంఘ కార్యానికి దూరంగా వుండటం జరిగింది. కాని ఈ జాతీయ పునర్నిర్మాణ మహా యజ్ఞంలో అందరికీ యథోచితంగా పాలుపంచుకునే అవకాశం లభింపచేయాలి. అప్పుడే నిర్దిష్టమైన లక్ష్యానికి త్వరితగతని చేరుకోగల్గుతాము. ఇది గుర్తించిన భయ్యాజీ విడిపోయిన ముక్కలు అతకడం, మాసి మూలన పడిన లోహానికి వన్నె పెట్టడం అనే పనిలో నిమగ్నమైపోయారు. ఒక దశాబ్దం పాటు శ్రమపడిన అనంతరం అలాంటి రత్నాలన్నింటిని ఒకచోట చేర్చి కాంతులు వెదజల్లేట్లు చేయగలిగారు. వారి కార్యం రహీం కవితను గుర్తుకు తెస్తుంది -

టూటీ సుజన మనాయియే. జో టూటె సౌబార్
రహీమాన్ ఫిర్-ఫిర్ పోయియే టూటౌ ముక్తాహార్"

ఆ "ముక్తాహారమే" ఈనాడు సంఘ కార్యాన్ని ముందుకు సాగిస్తున్నది. ఇది చూసి స్వర్గంలో ఉన్న భయ్యాజీ ఆత్మ పులకిస్తూ ఉంటుందనడంలో సందేహం లేదు.

# మొదటి గృహస్థ ప్రచారక్

ఈనాడు దేశంలో గృహస్థ ప్రచారకులు, వానప్రస్థ ప్రచారకులు సంఖ్య బాగానే పెరిగింది. అనేక చోట్ల ఇలాంటి కార్యకర్తలు మనకు కనిపిస్తున్నారు. తమ కుటుంబ బాధ్యతలను ముగించుకుని భావి బాధ్యతలను తమ సంతానానికి వదిలిపెట్టి సంసారిక బాధ్యతల నుండి విముక్తులై శేష జీవితాన్ని సంఘం నిర్దేశించిన రీతిలో గడిపేందుకు సంసిద్ధులై ముందుకు వస్తున్నవారు యిప్పుడు చాలామంది ఉన్నారు. ఉద్యోగాలు చేసుకునే వారిలో కూడా కొందరు కుటుంబ బాధ్యతలు పూర్తి అయినాయి అని భావించగానే, మధ్యలోనో లేక ఉద్యోగ విరమణ అనంతరమో సంఘ కార్యంలో కాని లేక సంఘం చేపట్టిన ఇతర సేవా కార్యక్రమాలలో నిమగ్నమై పూర్తి సమయాన్నిస్తున్నారు.

ఈనాడు ఈ సంప్రదాయం అతి సహజంగా మారిపోయిన కారణంగా అసలు దీనికి నాంది పలికిన వారెవ్వరు అన్న విషయం మనం గుర్తుంచుకోవటం లేదు. 1947-48కు పూర్వం గృహస్థ సంసారిక జీవనం గడుపుతున్న వారెవ్వరూ సంసార బాధ్యతల నుండి విముక్తులై పూర్తి సమయం సమాజ కార్యానికై వెచ్చించడానికి ముందుకు రావడమనేది నమ్మలేని విషయం. సంపన్న కుటుంబానికి చెందినవాడైన కారణంగా అనేక బాధ్యతలలో తలమునకలై ఉండి, సంసారిక జీవనాన్ని గడుపుతూ కూడా వాటన్నింటిని ప్రక్కనపెట్టి కొంతకాలం పాటు తమ పూర్తి సమయాన్ని సంఘం కోసమే వెచ్చించేందుకు సిద్ధపడి ముందుకు వచ్చిన ప్రథమ కార్యకర్త శ్రీ భయ్యాజీ దాణీ. ఇది చాలా తమాషాగా జరిగింది. 1942లో దేశానికి గొప్ప విపత్కర పరిస్థితి ఎదురైన కారణంగా కార్యకర్తలు ఇల్లు వదిలిపెట్టి ప్రచారకులుగా రావలసిందని గురూజీ పిలుపు

నిచ్చారు. భయ్యాజీ ఆ పిలుపు నందుకుని, తన గృహస్థ జీవనానికి సంబంధించిన పనులన్నీ ప్రక్కన పెట్టేసి ముందుకువచ్చి మిగతా కార్య కర్తలకు ఆదర్శమైనారు. గురూజీ వారిని మధ్య భారత్‌కు పంపించారు. ఇండోర్, ఉజ్జయిని, గ్వాలియర్ ఇత్యాది ప్రదేశాలలో వారు నిర్వహించిన సమావేశాలు, పరామర్శ పూర్వక పరిచయాలు, ఉపన్యాసాలు, ఎంతటి ప్రభావాన్ని చూపాయంటే, ఆనాడు వారి సంపర్కంలోనికి వచ్చిన స్వయంసేవకులు నేటికీ సంఘ కార్యాన్ని కొనసాగిస్తున్నారు.

కేవలం మూడు సంవత్సరాల కాలంలో మధ్యభారత్ లోని సంఘ కార్యాన్ని విస్తృతపరిచి ఊపు తెచ్చారు. కాని నిరంతర శ్రమకు గురియైన కారణంగా ఆరోగ్యం దెబ్బతిన్నది. 1945లో గురూజీ వారిని తిరిగి నాగపూర్‌కు పిలిపించారు.

## కష్టకాలంలో చుక్కాని పట్టారు

ఆయన శక్తి యుక్తులకు ఒక పెద్ద పరీక్ష వచ్చిపడింది. 1945లో ఆయన సర్ కార్యవాహగా నియుక్తులైనారు. ఒక దశాబ్దంపాటు సంఘ కార్య ప్రగతికి అవిరళ కృషి సలిపారు. ఈ కాలంలో ఆరు సంవత్స రాలపాటు సంఘమే కాదు. యావత్ సమాజం అత్యంత గడ్డు పరిస్థితులను ఎదుర్కొనవలసి వచ్చింది. దేశ విభజనకు పూర్వం, దేశ విభజన సమయంలోనూ అత్యంత భయానకమైన మారణకాండ కొనసాగింది. పాకిస్తాన్ నుంచి శరణార్థులను మోసుకొని ఒకదాని తర్వాత ఒకటిగా రైళ్ళు భారత దేశం చేరటం, భారతమాత ఖండించబడటం, గాంధీజీ దారుణ హత్యకు గురికావడం, సంఘంపైన నిషేధం విధించబడటం, పిచ్చెక్కినట్లుగా సంఘ కార్యకర్తలపైన దాడులు జరగడం, మొదటి

సాధారణ ఎన్నికలు నిర్వహించబడటం మొదలైన ఘట్టాలు యీ ఆరేండ్ల కాలంలో వేగంగా జరిగిపోయాయి.

ఈ సంఘటనలన్నీ భయ్యాజీ మనస్సుపైన ఎంతటి ఒత్తిడి తెచ్చి ఉంటాయో ఊహించుకోవచ్చు. కుటుంబానికి పూర్తిగా దూరంగా ఉండవలసి వచ్చింది. అడుగడుగునా కార్యకర్తలు బాధలకు గురిఅవుతూ వచ్చిన కారణంగా పరిష్కారం సూచించడానికి గాను ఢిల్లీలోనే గడపవలసి వచ్చింది.

పంజాబు నుండి వచ్చిన హిందువులకు రక్షణ కల్పించి, సదుపాయాలు కల్పించే పని పంజాబ్ ప్రాంత ప్రచారకులైన శ్రీ మాధవరావు మూలే నిర్వహించారు. అయినా ఆ పనికి సంబంధించిన పర్యవేక్షణ భారం భయ్యాజీ పైనే పడింది.

ఇది చాలదన్నట్లుగా గాంధీజీ హత్యా నేరం సంఘంపై మోపబడి శ్రీ గురూజీ నిర్బంధించబడ్డారు. దాదాపు 18 మాసాలు జైలులోనే వున్నారు. ఆ క్లిష్ట సమయంలో స్వయం సేవకుల మనోబలాన్ని కాపాడి, సంఘ కార్యాన్ని సుదృఢంగా నిలిపి ఉంచే బాధ్యత కూడా భయ్యాజీయే వహించవలసి వచ్చింది.

## అన్ని కోల్పోయినా సంయమనం విడువలేదు

గాంధీజీ హత్యానంతరం ఉమ్రేడ్‌లో వున్న భయ్యాజీ గృహంపైన దాదాపు నాలుగువేల మంది ఆకతాయిలు దాడిచేసి, ఇంటిని ధ్వంసం చేశారు. ఇంట్లోవున్న వారి ప్రాణాలు కూడా అపాయంలో పడ్డాయి. కాని ఆ స్థితిలో కూడా భయ్యాజీ గురూజీ వద్దనే కూర్చుని వున్నారు. తమ

స్వంత యిల్లు, కుటుంబం కంటే సంఘము, గురూజీ సురక్షితంగా ఉండటమే ముఖ్యం అనుకున్నారు. ఉమ్రేడ్‌లో జరిగిన విధ్వంసకాండను స్థితప్రజ్ఞుడిలా నిర్లిప్తంగా విన్నారేకానీ, ఏమాత్రం విచలితులు కాలేదు.

కొందరు స్వయం సేవకుల యిళ్ళపైన కూడా అనేక దాడులు జరుగుతున్నాయన్న సంగతి విన్న తర్వాత, "ఎట్టి పరిస్థితులలోనూ, ప్రతీకార చర్యకు పూనుకోవద్దు" అంటూ స్వయం సేవక సోదరుల నుద్దేశించి శ్రీ గురూజీ పంపిన సందేశాన్ని భయ్యాజీ టెలిగ్రామ్‌ల ద్వారా వివిధచోట్లకు పంపించారు. ఈ ఆదేశాన్ని అందరికంటే ముందు తానే పాటించి చూపించారు భయ్యాజీ. తన సంపత్తిని దోచుకుపోవడం చూస్తూ ఊరుకున్నారే కాని సంయమనాన్ని ఏమాత్రం కోల్పోలేదు.

గాంధీజీ హత్య కేసులో సంఘ నిర్దోషిత్వము ఋజువు అయిన తర్వాతకూడా ప్రభుత్వం ఏవో చిక్కులు పెడుతూ వచ్చింది. శ్రీ గురూజీని ఢిల్లీలో మళ్ళీ అరెస్టు చేశారు. ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా ప్రభుత్వంతో పని జరుగదనే విషయం తేలిపోయాక భావి కార్యక్రమాన్ని ఆలోచించి వ్యూహరచన చేసే బాధ్యత అంతా భయ్యాజీపైనే పడింది. సత్యాగ్రహాలకు సంబంధించిన వ్యూహ రచన ఎంత పటిష్టంగా చేశారంటే, అది కేవలం భారతదేశంలోనే కాక ప్రపంచం అంతటా ప్రశంసాపాత్రమైంది. 80 వేలమంది స్వయంసేవకులు జైళ్ళకు వెళ్ళారు. చివరకు విధిలేక ప్రభుత్వం సంఘంపైన నిషేధం తొలగించింది.

నిషేధం తొలగించబడ్డాక, వెంటనే శాఖల పునర్నిర్మాణం చేపట్టవలసి వచ్చింది. అప్పుడు అదే పెద్ద సవాలు. శ్రీ గురూజీ ఉపన్యాసాల ద్వారాను, బైఠక్‌ల ద్వారాను స్థూలంగా మార్గదర్శనం లభిస్తుండేది. కాని వివరంగా స్వయంసేవకుల మనస్సులలో ఉన్న శంకలన్నింటిని తెలుసు

కుని వాటికి సమాధానాలు అందించి, వారిని సంతృప్తిపరచవలసిన బాధ్యత భయ్యాజీ పైన పడింది.

## మన తపస్సుకు ఫలితం యిదేనా?

1952లో జరిగిన సార్వత్రిక ఎన్నికలలో ఢిల్లీ, పంజాబు ప్రాంతాలనుండి అనేకమంది కార్యకర్తలు భారతీయ జనసంఘ అభ్యర్థులుగా పోటీ చేశారు. వీరిలో చాలామంది దేశ విభజన సమయంలో అనేక కష్టనష్టాలకోర్చి, పీడిత ప్రజలకు సహాయ మందించినవారూ వున్నారు. కాని ఎన్నికలలో వారికి ప్రజలనుండి ఆశించిన మద్దతు లభించక ఓడి పోయారు. యిందుకు భిన్నంగా దేశ విభజన కాలంలో పిరికిపందలుగా బుజువైన కొంతమంది కాంగ్రెస్ అభ్యర్థులుగా విజయం సాధించారు. యిది చూశాక కార్యకర్తలలో ఘోరమైన నిరాశ జనించింది. "మనం చేసిన తపస్సుకు ఫలితం యిదేనా?" "మన త్యాగాల విలువ ఇంతేనా?" అంటూ ప్రశ్నించారు.

ఢిల్లీ, పంజాబు ప్రాంత ప్రచారకులైన శ్రీ మాధవరావు మూళ్యే కార్యకర్తల మనోభావాలను భయ్యాజీకి తెలియచేశారు. వెంటనే భయ్యాజీ అలాంటి కార్యకర్తల బైఠక్ ఏర్పాటు చేశారు. ఉద్రేకంలోనూ ఆవేశం లోనూ వారు చెప్పేదంతా ప్రశాంతంగా విని ఒకే ఒక ప్రశ్నతో వారి నోటికి తాళం పడేట్లు చేశారు భయ్యాజీ. "సంఘం ఎందుకు ప్రారంభిం చామో, సంఘ కార్యం ఎందుకు చేస్తున్నామో మనం మర్చిపోయామా? మనలను ఎన్నికలలో గెలిపించి అధికారంలోనికి తేవాలని నిరాశ్రయులకు సేవ చేశామా?" అని అడిగారు.

## అలాంటి వారు సంఘాన్ని వదిలిపెట్టొచ్చు

భయ్యాజీ ఒకటి రెండు మాటలలో టూకీగా యిలా చెప్పారు: "నిరపేక్ష భావంతో సేవ చేయటం సంఘం మనకు నేర్పింది. అధికారం కైవసం చేసుకోవాలనే కోర్కె గలిగి సంఘం అందుకు ఉపయోగ పడాలనుకొనే వారు సంఘాన్ని విడిచిపోవచ్చు. క్రొత్త కార్యకర్తల నిర్మాణం చేసుకుని సంఘం తన కార్యాన్ని పునర్నిర్మాణం చేసుకుంటుందే కాని యిలాంటి హేయభావాన్ని కలిగినవారిని ఎన్నటికీ ఆశ్రయించదు" అన్నారు.

భయ్యాజీ చెప్పిన మాటలు విన్నాక ఎన్నికల జ్వరం ఎగిరి పోయింది. అనుమానాలన్నీ తొలగిపోయాయి. ఆ తర్వాత యిక బైఠక్‌లో చర్చించటానికి ఏమీ మిగలలేదు. బైఠక్ అయిపోయాక అందరూ సంఘ శాఖల విస్తరణకు సంబంధించి వ్యూహాన్ని ఆలోచించడంలో మునిగి పోయారు.

## విస్పష్టమైన అవగాహన - అర్థవంతమైన జవాబు

సంఘ కార్యం పట్ల స్పష్టమైన అవగాహన ఉన్న కారణంగా ఎంతటి జటిలమైన సమస్యకైనా భయ్యాజీ తడుముకోకుండా సమాధానం చెప్పేవారు.

1951లో భారతీయ జనసంఘం స్థాపించాక సంఘంపట్ల అనేక మంది ఆగ్రహించారు. సంఘమే స్వయంగా రాజకీయాలలో ప్రవేశించి, హిందూ మహా సభలో కలసిపోవాలనే కోర్కె వారికి ఉండేది. ఉత్తర ప్రదేశ్ నుండి బిషన్ చంద్రసేఠ్ అనే హిందూ మహాసభ కార్యకర్త

ఈ విషయమై గురూజీకి అనేక లేఖలు వ్రాశారు. ఇలాంటి విషయాలు ఉత్తరాల ద్వారా చర్చించదగినవి కావు అని, ముఖాముఖి కలిసినప్పుడు చర్చించుకొందాం అని తెలిపారు గురూజీ.

ఒకసారి భయ్యాజీ, గురూజీ ఉత్తరప్రదేశ్ పర్యటనలో ఉన్న సందర్భంలో అనుకోకుండా బిషన్ చంద్రసేఠ్‌జీ గురూజీ ఉన్న రైలు పెట్టెలోనే ఎక్కారు. అక్కడే విషయాన్ని చర్చించటం ప్రారంభించారు. అప్పుడు గురూజీ భయ్యాజీని చూపిస్తూ- "ఈయన మా సర్ కార్యవాహ గారు. కార్యక్రమాలన్నీ చూసేది ఈయనే. నేను కేవలం మార్గదర్శకం చేస్తాను. కాబట్టి మీరు ఈయనతోనే మాట్లాడండి" అన్నారు. ఇక సంభాషణ ప్రారంభమైంది. భయ్యాజీ ఆ సేఠ్‌జీకి తగిన విధంగా సమాధానం చెప్పారు. ఇక ఆ తర్వాత సేఠ్‌జీ ఉత్తరాలు బంద్ అయ్యాయి.

సంఘ గోహత్యా నిరోధ ఉద్యమం చేపట్టిన రోజుల్లో ప్రముఖ సమాజ సేవకులు అయిన శ్రీ అశోక్ మెహతా నాగపూర్ వచ్చి భయ్యాజీతో సుదీర్ఘ సంభాషణలు జరిపారు. భయ్యాజీ తార్కికంగా తగిన సమాధానం చెప్పడంతో నిరుత్తరులై తిరిగి పోయారు.

శ్రీమంతుల కుటుంబంలో జన్మించిన వారైనప్పటి భయ్యాజీ పద్ధతులన్నీ అతి సామాన్యంగా ఉంటుండేవి. ఒక్కొక్కసారి ఎక్కడ వస్తువులు అక్కడే పడేసి సర్దుకోవటం కూడా చేతకాదు అన్నట్లు గడిపేవారు. తెల్లటి నెహ్రూకట్ నూలు కుర్తా, వదులు వదులుగా ఉన్న ధోతి, నల్ల టోపి - ఇదే ఆయన వేషము, పోనీ అవైనా ఎప్పటికప్పుడు ఇస్త్రీ చేయించి నలగకుండా చూసుకుంటారా అంటే అదీలేదు. చాలాసార్లు ఆయనను పద్ధతి ప్రకారం బట్టలు ధరించమని చెపుతూండేవారు శ్రీ గురూజీ. ఒక్కొక్కసారి ఆయన బట్టలు చూసి ఎవరైనా తమాషాగా ఎగతాళి

ఈ విషయమై గురూజీకి అనేక లేఖలు వ్రాశారు. ఇలాంటి విషయాలు ఉత్తరాల ద్వారా చర్చించదగినవి కావు అని, ముఖాముఖి కలిసినప్పుడు చర్చించుకొందాం అని తెలిపారు గురూజీ.

ఒకసారి భయ్యాజీ, గురూజీ ఉత్తరప్రదేశ్ పర్యటనలో ఉన్న సందర్భంలో అనుకోకుండా బిషన్ చంద్ర సేఠ్‌జీ గురూజీ ఉన్న రైలు పెట్టెలోనే ఎక్కారు. అక్కడే విషయాన్ని చర్చించటం ప్రారంభించారు. అప్పుడు గురూజీ భయ్యాజీని చూపిస్తూ- "ఈయన మా సర్ కార్యవాహ గారు. కార్యక్రమాలన్నీ చూసేది ఈయనే. నేను కేవలం మార్గదర్శకం చేస్తాను. కాబట్టి మీరు ఈయనతోనే మాట్లాడండి" అన్నారు. ఇక సంభాషణ ప్రారంభమైంది. భయ్యాజీ ఆ సేఠ్‌జీకి తగిన విధంగా సమాధానం చెప్పారు. ఇక ఆ తర్వాత సేఠ్‌జీ ఉత్తరాలు బంద్ అయ్యాయి.

సంఘ గోహత్యా నిరోధ ఉద్యమం చేపట్టిన రోజుల్లో ప్రముఖ సమాజ సేవకులు అయిన శ్రీ అశోక్ మెహతా నాగపూర్ వచ్చి భయ్యాజీతో సుదీర్ఘ సంభాషణలు జరిపారు. భయ్యాజీ తార్కికంగా తగిన సమాధానం చెప్పడంతో నిరుత్తరులై తిరిగి పోయారు.

శ్రీమంతుల కుటుంబంలో జన్మించిన వారైనప్పటి భయ్యాజీ పద్ధతులన్నీ అతి సామాన్యంగా ఉంటుండేవి. ఒక్కొక్కసారి ఎక్కడ వస్తువులు అక్కడే పడేసి సర్దుకోవడం కూడా చేతకాదు అన్నట్లు గడిపేవారు. తెల్లటి నెహ్రూకట్ నూలు కుర్తా, వదులు వదులుగా ఉన్న ధోతి, నల్ల టోపి - ఇదే ఆయన వేషము, పోనీ అవైనా ఎప్పటికప్పుడు ఇస్త్రీ చేయించి నలగకుండా చూసుకుంటారా అంటే అదీ లేదు. చాలాసార్లు ఆయనను పద్ధతి ప్రకారం బట్టలు ధరించమని చెపుతూండేవారు శ్రీ గురూజీ. ఒక్కొక్కసారి ఆయన బట్టలు చూసి ఎవరైనా తమాషాగా ఎగతాళి

ఉత్తరాలన్నీ వ్రాయటం పూర్తిచేసి పంపి, గురూజీ స్వయంగా వ్రాసిన ఉత్తరాలు మాత్రం తమవద్దనే భద్రపరచుకొన్నారు భయ్యాజీ. దేశ స్వాతంత్ర్యం సిద్ధించాక, అలాగే సంఘం పైన నిషేధం తొలగించాక స్వయంసేవకులు చాలామంది భయ్యాజీకి దగ్గరగా వచ్చి "యువకులలో సంఘంపట్ల ఆకర్షణ తగ్గిపోయినట్లు కనిపిస్తుంది. అంతా హోమ్‌గార్డు ఉద్యమాలవైపు ఆకర్షితులవుతున్నారు." అంటూ ఆందోళన వ్యక్తం చేశారు. "సంఘంలో చేరితే ఉద్యోగాలు రావనే భయం కొందరిని పీడిస్తుండగా మరికొందరు తమ శ్రేయోభిలాషులనేవారు చెప్పే మాటలు విని సంఘానికి రావడం మానివేస్తున్నారు. మరి కొందరేమో సంఘం రాజకీయ పార్టీగా మారిపోయి ప్రత్యక్ష రాజకీయాల్లో జొరబడాలంటున్నారు" అంటూ నివేదించారు.

## డూ, డూ బసవన్నలు చరిత్ర నిర్మించలేరు

ఇలాంటి ప్రశ్నలు అన్నింటికి సమాధానం తన సర్ కార్యవాహ వార్షిక నివేదికలో పొందుపరిచారు భయ్యాజీ. సంఘముపైన నిషేధం తొలగించిన తర్వాత రెండు సంవత్సరాలకు జరిగిన అఖిల భారత ప్రతినిధి సమావేశాలలో సర్ కార్యవాహగా దేశ పరిస్థితిని విశ్లేషణ చేస్తూ భయ్యాజీ మూడుగంటలపాటు చేసిన ప్రసంగం చిరస్మరణీయంగా నిలిచిపోతుంది. "ఈ కష్టాలు ఏకరువుపెట్టే ప్రవృత్తిని నిర్మూలించడమే సంఘకార్యం. కాసేపు సంఘం రాజకీయాలలో ప్రవేశించి ఎన్నికలలో విజయం పొంది అధికారంలో వుందనే అనుకొందాం. అప్పుడు సంఘానికి వచ్చే వాళ్ళ సంఖ్య పెరిగి పోవచ్చును కాని, ఆ విధంగా పోగైన వ్యక్తులలో పిరికి పందలు, స్వార్థ పరాయణులు, కులాసా రాయుళ్ళు కనిపిస్తారే కాని సంఘ ఆదర్శాలకు కట్టుబడి జీవించే స్వయం సేవకులు కానరారు. సంఘం కోరుకునేది అది కాదు.

స్వార్థపరులు, పిరికివారు, డూ డూ బసవన్నలు ఎన్నడూ చరిత్ర నిర్మాణం చేయలేరు. వారు సృష్టించే చరిత్ర అంటూ ఏదైనా వుంటే అది అధోగతికి దారి చూపేది మాత్రమే అవుతుంది. ఇలాంటివారు ఏనాడూ శక్తి కేంద్రాలుగా మనజాలరు. అందుకు భిన్నంగా దుర్గంధాన్ని వ్యాపింప చేసే సమూహంగా తయారు అవుతారు. అలాంటి వారి సంపర్కంలోనికి రావాలని ఎవరూ ఇచ్ఛగించరు.

ఒకవేళ ఇప్పుడు సంఘంలోనికి పిరికిపందలు, స్వార్థపరులు ఎవరైనా జొరపడి ఉన్నట్లయితే సంఘం ఎదుర్కొంటున్న కష్టాలు చూసి జారుకోవడం మంచిది. అందులో తప్పు ఏమీ లేదు. అలాంటివారు సంఘానికి దూరం అయితే సంఘ శక్తి పెరుగుతుంది. అప్పుడు సంఘ కార్యకర్తలు శిశు, బాల స్వయం సేవకులపైన తమ దృష్టి కేంద్రీకరించ గలగుతారు. అదృష్ట వశాత్తూ ఈ స్థితి సంఘంలో లేదు. ఒకవేళ ఆ పరిస్థితి దాపురిస్తే, డాక్టర్‌జీ అడుగు జాడలలో నడుస్తూ సంఘకార్యం తిరిగి శిశు స్వయం సేవకుల నుండి ప్రారంభిస్తాం."

## వృద్ధనారి...

ప్రభుత్వోద్యోగాలలో ఉన్న స్వయం సేవకులపై పెట్టిన ఆంక్షలను గూర్చి మాట్లాడుతూ, 'ఈ విషయం విని నాకు నవ్వు వస్తోంది. మన సమాజంలో ఎంత శాతం ప్రభుత్వోద్యోగాలలో పని చేస్తున్న వారున్నారు? అలాంటి వారిలో ఒక్కరూ కూడా సంఘానికి రారు అనుకోండి, అలాంటప్పుడు సంఘానికి జరిగే నష్టం ఏపాటిది? అసలు నష్టం అంటూ ఏమన్నా వుంటే అది ప్రభుత్వానికే జరుగుతుంది. (సద్గుణ సంపన్నులు, నిష్ఠతో పని చేసే వారు అయిన మంచి స్వయం సేవకులను పోగొట్టుకోవడం చేత.) అయితే ప్రస్తుతం ఉన్న ప్రభుత్వానికి సచ్ఛీలురు అయిన

సేవకులు అవసరం లేదనే అనిపిస్తుంది... యీ నివేదిక సూర్యోదయాన్ని నిలిపివేసేందుకు ఒక ముసలమ్మ తన కోడిపుంజును గంపకింద దాచిపెట్టి నట్లుగా ఉంది. యిది హాస్యాస్పదమైన విషయం.

ఈ సమయంలోనే సంఘ స్వయం సేవకులు సమాజ జీవనంలో అనేక రంగాలలో అడుగు పెట్టడం ప్రారంభమైంది. అలాంటి కార్యకర్తల పైన సంఘం ఎంత గొప్ప ఆశలు పెట్టుకున్నదో వివరిస్తూ "రాజకీయా లలో అడుగు పెడుతూనే స్వయం సేవకులు నిష్ప్రయోజనులు భ్రష్టులు అయిపోయేంత బలహీనులని సంఘం ఎన్నడూ భావించడం లేదు అంతే కాదు. సమాజ జీవనంలోని ప్రతి రంగంలోనూ మన కార్యకర్తలు ప్రవే శించటం చేత సమాజ హితానికి పనికొచ్చే మార్పులు సంభవిస్తాయని సంఘం ఆశిస్తూంది. సమాజ పురోభివృద్ధికి గాను, ప్రతి రంగంలోనూ సద్గుణ సంపన్నులూ, సచ్ఛీలురూ అయిన కార్యకర్తల ఆవశ్యకత ఎంతైనా వుంది. విశ్వాస పాత్రులైన కర్తవ్య దీక్ష, దక్షత గల నిపుణులు అయిన కార్యకర్తల నిర్మాణం ప్రతి రంగంలోనూ జరుగుతుంది. ఈ ఆశతోనే సంఘం ఇంతకాలం వ్యక్తి నిర్మాణ కార్యక్రమంలో తలమునకలై పని చేస్తూ వచ్చింది. ఇలాంటి వ్యక్తుల నిర్మాణం నిరంతరం సాగాలనేదే సంఘం కోరిక. ఈ కార్య సాఫల్యానికి అపరిమితమైన శ్రమతో, అనేక కష్టాలకోర్చి సహనంతో పని చేయాల్సి వుంటుంది" అన్నారు.

## అవసరం లేని ప్రచారంకోసం అర్రులు చాచడం ఎందుకు?

భయ్యాజీ 1956 వరకు సర్ కార్యవాహ బాధ్యతను నిర్వహిస్తూ ఆ గురుతరమైన బాధ్యతను అత్యంత నేర్పుతో నెరవేర్చి సంఘ కార్యానికి శక్తివంతమైన మార్గదర్శనం చేశారు. కాని ఈ సంవత్సరమే

తన తండ్రిగారు స్వర్గస్థులైన కారణంగా ఉమ్రేడ్‌లోని ఇంటి బాధ్యతలు భయ్యాజీపైన పడ్డాయి. ఆ రోజుల్లో భయ్యాజీ ఆరోగ్యం కూడా కొంత క్షీణించింది. కాబట్టి కొంతకాలం ఆయనకు పనిభారం తగ్గించేందుకై సర్‌కార్యవాహ బాధ్యత ఏక్‌నాథ్ రానడే గారికి ఒప్పగించడం జరిగింది. అయినప్పటికీ నాగపూర్ నుండి వచ్చే దినపత్రిక "తరుణ్ భారత్"ను ప్రచురిస్తున్న "నరకేసరి ప్రకాశన్" బాధ్యత భయ్యాజీయే వహిస్తుండే వారు.

తరుణ్ భారత్ సంపాదకుడు గాని, మేనేజర్‌గాని సంఘ స్వయం సేవకులు కారు. అయినప్పటికీ భయ్యాజీకి వారికి మధ్య నెలకొన్న సత్సంబంధాల వల్ల 'నరకేసరి ప్రకాశన్' సువ్యవస్థితంగా సాగింది. సంపాదకత్వానికి సంబంధించిన విషయాలలో భయ్యాజీ ఎప్పుడూ జోక్యం చేసుకునేవారు కారు. అనేకసార్లు స్వయంసేవకులతో అంటుండే వారు- "అనవసరమైన ప్రచారం కోసం అర్రులు చాచడం కూడదు."

1962 లో ఏకనాథ్‌జీకి వివేకానంద శిలాస్మారక కార్యం ఒప్ప చెప్పాక మళ్ళీ సర్‌కార్యవాహ బాధ్యత భయ్యాజీకి ఒప్పగించవలసి వచ్చింది. అందుకు భయ్యాజీ అంగీకరించారు కూడా. కాని ఒక సంవత్సరం అయ్యేప్పటికి హృద్రోగానికి గురి అయ్యారు. పూర్తి విశ్రాంతి తీసుకోవాలని డాక్టర్లు సలహా యిచ్చారు. ఆయన పర్యటన పైన ఆంక్షలు విధించవలసి వచ్చింది. అయినప్పటికీ వారు అనేక ప్రాంతాలకు వెళ్ళి ముఖ్య కేంద్రాలలో పర్యటన జరిపారు. వారి ఆరోగ్యం క్రమంగా క్షీణిస్తూ పోయింది. మార్చి 1965 లో అఖిల భారత ప్రతినిధి సభ జరిగినప్పుడు భయ్యాజీ స్థానంలో శ్రీ బాలాసాహెబ్ దేవరస్‌ను సర్‌కార్యవాహగా ఎన్నుకోవడం జరిగింది.

ఉండిసుమా అని నవ్వులాటకు అన్నట్లే ఉన్నది.) ఇందులో ఒక సందేశం ఇమిడి వుంది. గట అంటే అంత చిన్నదిగా ఉండకూడదు. ఇంత విశాల మైన హిందూ సమాజాన్ని సంఘటిత పర్చాలన్న కార్యభారం నెత్తిన వేసికొన్న తర్వాత కార్యానికి సంబంధించిన ఊహ కూడా అంత పెద్ద ఎత్తునే ఉండాలి. నాలుగు, అయిదులతో సంతృప్తి చెందకూడదు.

## గంటలకొద్దీ మాట్లాడుతున్నా విసుగుజనించని ధోరణి

భయ్యాజీ బౌద్ధిక్ అంటే సుదీర్ఘమైన ప్రసంగిమే అయితే నిత్యం మన అనుభూతుల్లో ఉన్న ఉదాహరణలు చెప్తూ నవ్విస్తూ, కవ్విస్తూ స్వయం సేవకులు తన్మయత్వంతో వినే రీతిలో సాగేది ఆ ప్రసంగం. (శ్రీ మోరో పంత్‌జీ పింగళే గారి ప్రసంగం వింటున్నప్పుడు అనుభవించిన ఆనందం లాంటిదే.) అదే కార్యకర్తల నుద్దేశించి మాట్లాడటమైతే ఇంకా పెద్దదిగా ఉండేది ప్రసంగం. ఒక్కోసారి ఆ ప్రసంగాలు ఎంత పొడవుగా ఉండేవంటే కార్యకర్తలు లఘుశంక తీర్చుకోవడానికి కూడా వీలుబడేది కాదు. అయినా బహు శ్రద్ధతో ఆ ప్రసంగాలు వినగల్గిన రీతిలో ఉండేది ఆ శైలి. సంఘం పైన నిషేధం తొలగించిన రెండేళ్ళ తర్వాత జరిగిన అఖిల భారతీయ ప్రతినిధి సభలలో జరిగిన బైఠక్‌లో ఏకబిగిన మూడు గంటలు ప్రసంగించారన్న సంగతి మనకు గుర్తు ఉండే ఉంటుంది.

## వేటాడాలని వచ్చి...

ఎంతటి జటిలమైన వ్యక్తి నుండి అయినా తాను రాబట్టదలచిన విషయాన్ని క్షణాల్లో రాబట్టగలననే అహంకారంతో ఢిల్లీలోని పత్రికా విలేకరి ఒకరు భయ్యాజీ వద్దకు వచ్చారు. అయితే ఆ పత్రికా విలేఖరి మాట్లాడటం మొదలుపెట్టక పూర్వమే భయ్యాజీ పిచ్చాపాటి ప్రారంభించారు. దేశ సమస్యలకు సంబంధించిన అనేక విషయాలపైన విరామం

లేకుండా, ఒక ప్రశ్న తర్వాత మరొకటి అడుగుతూ సమాధానాలు రాబడుతున్నారు. గంటలకొద్దీ ఈయన అడగడం ఆయన సమాధానం చెప్పడం సరిపోయింది. అసలు ఏదైనా అడగడానికి ఆ విలేఖరికి అవకాశమే దొరకడం లేదు. ఆఖరికి ఒకసారి మాత్రం కాస్త విరామం దొరికింది. అదీ కావాలని భయ్యాజీ ఇచ్చిందే. దొరికిందే చాలు భగవంతుడా అని ఆ విలేకరి 'ప్రస్తుతం దేశం ఎదుర్కొంటున్న ముఖ్యమైన సమస్యలను గూర్చి మీ అభిప్రాయం ఏమిటి?' అని అడిగాడు. ఎంతో అమాయకంగాను, అత్యంత సహజంగాను 'ఏముందీ, ఇప్పటిదాకా మీరు వెలిబుచ్చిన అభిప్రాయమే!' అన్నారు భయ్యాజీ. పాపం, ఆయనగారు ఇక అక్కడనుంచి నిష్క్రమించటం తప్ప చేయగలిగిందేముంది? తాడి ఎక్కేవాడుంటే వాడి తలదన్నేవాడుంటాడన్నది ఋజువైంది.

## ఈ ప్రతిజ్ఞ సరే, మరి ఆ ప్రతిజ్ఞ మాట ఏమిటి ?

తమ విద్యా వ్యాసంగం పూర్తిఅయినాక ఒకటి, రెండు సంవత్సరాలు సంఘకార్యం చేయటానికి ముందుకు వచ్చిన కార్యకర్తల బైఠక్ ఒకటి జరుగుతుంది. అలాంటి కార్యకర్తల కుటుంబ పరిస్థితిని గూర్చి బాధ్యతలను గూర్చి వివరాలు తెలుసుకుంటున్నారు. వివాహం అయిన ఒక కార్యకర్త తన యింటి పరిస్థితిని చెప్పటం ప్రారంభించగానే, 'నీవెలా ప్రచారక్‌గా వెళ్ళగలుగుతావు?' అని ప్రశ్నించారు భయ్యాజీ. 'నేను సంఘంలో ప్రతిజ్ఞ స్వీకరించిన స్వయంసేవక్‌ను. తలుచుకుంటే తరణోపాయం లభిస్తుంది' అన్నాడు ఆ కార్యకర్త. అయితే ఆ కార్యకర్తను వత్తి చూద్దామన్న భావనతో 'అగ్నిసాక్షిగా కొంగు ముడేసుకుని ఏడడుగులు నడుస్తూ చేసిన ప్రతిజ్ఞ మాటేమిటి?' అన్నారు భయ్యాజీ. ఆ కార్యకర్త కాస్త సంకోచంలో పడటం, యీలోగా మిగతా కార్యకర్తలంతా నవ్వేయడం జరిగింది. ఆ నవ్వులతో జత కలుపుతూ భయ్యాజీ,

'గాభరా పడక్కర్లేదు. నీవు అన్నట్లు మనస్సుంటే మార్గం వుండకపోదు' అన్నారు. (అలా అనడంలో వివాహితుడైనప్పటికీ నేను సంఘకార్యం చేయగల్గుతున్నానా లేదా అన్న సంకేతం ఇమిడివుంది.)

## భయ్యాజీ మాట్లాడుతుంటే...

ఎంతో సహజంగా, సరళమైన రీతిలో మార్గదర్శనం లభించేది. సంఘకార్యంలాంటి కంటకాకీర్ణమార్గం కూడా, పట్టుదల వుంటే నవ్వుతూ, నవ్వుతూ సుగమంగా మార్చుకుని ముందుకు సాగవచ్చునన్న విషయం అభ్యాసం చేయిస్తున్నారా- అన్నట్లుండేది.

శ్రీ గురూజీతో మాట్లాడేటప్పుడు కూడా భయ్యాజీ మాటల్లో ఈ హాస్యప్రియత్వం కనిపించేదంటారు సంఘ పెద్దలు. ఒకసారి భయ్యాజీ తమ సంతానాన్ని గూర్చి మాట్లాడుతూ, మా మూడోవాడు అంటూ ఏదో చెప్పబోతుండగా మధ్యలో శ్రీ గురూజీ అందుకొని ఆ కుర్రవాడి పేరు తానే చెప్పి, 'భయ్యాజీకి తమ సంతానం ఎంతో, వారి పేర్లు ఏమిటో కూడా జ్ఞాపకం వున్నట్లు లేదు' అన్నారు నవ్వుతూ. వెంటనే భయ్యాజీ అందుకుని 'మహాప్రభూ! మీకు ఆ పేర్లు గుర్తుంచుకుంటే చాలు. మరినేనో? వాడి బట్టలు, చదువు, వాడి తిరుగుళ్ళు, వాడి తిండి...ఎన్నని గుర్తుంచుకో గలను?" అన్నారు.

ఇక అలాంటి సహృదయుల సన్నిధిలో కాలం ఎలా గడిచింది అన్న స్పృహ రాగలదా? మనం కూడా అలాగే అనునిత్యం నవ్వుతూ నవ్వుతూ, పాటలు పాడుతూ సర్వ సమర్పణా భావంతో తన, మన, ధన, జీవన సర్వస్వం సమర్పణ చేసి, పతత్వేష కాయో నమస్తే నమస్తే అంటూ భారతమాతకు మొకరిల్లుదాం.

—: o :—

## కార్యక్షమతాశీలి

# ఏకనాథజీ రానడే

రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ సాయం శాఖలు నడుపుతున్న ప్రదేశాలలో కొన్ని దృశ్యాలు తరచుగా మన కంట పడుతూ ఉంటాయి. అల్లరి చేస్తున్నారనో మరో కారణంచేతనో కొందరు బాలురను శాఖా కార్యక్రమాలకు రానివ్వరు. అలాంటివారు మరికొంతమందిని జత చేసుకొని సంఘశాఖ జరుగుతున్న ప్రదేశం ప్రక్కనే జేరి అరుస్తూ ఉండటం, రాళ్ళు విసరటం, ఎగతాళిగా ప్రార్థన చదువుతూ ఉండడం, ఏక్, దో, ఏక్, దో అని ఎకసెక్కంగా సంఘ ఆజ్ఞలు జారీ చేస్తుండటం - ఇలాంటి కొంటె పనులు చేస్తుఉంటాచు. వీళ్ళు సంఘానికి విరోధులు కారు. ఏదో రకంగా అక్కడి శిక్షక్ దృష్టిని ఆకర్షించి, ఒకనాడు కాకపోతే మరొకనాడైనా శాఖలో ప్రవేశించాలనే మంకు పట్టుదల కల్గి ఉంటారు. కాస్త అటు ఇటుగా వారికి ప్రవేశం లభిస్తుండేది కూడా. కొంత కుదురుగా ఉండటం నేర్చుకున్నాక అలాంటివారు చక్కని కార్యకర్తలుగా రూపొందిన ఉదాహరణలు చాలా ఉన్నాయి.

సంఘం ప్రారంభించిన తొలిరోజుల్లో బాలలకు సంఘంలో అసలు ప్రవేశం లభించేది కాదు. అందుచేత ఇలాంటి అల్లరి బాలల సంఖ్య ఆ రోజుల్లో ఎక్కువగా ఉండటం సహజమే. కొందరు బాలురు ఏ రకమైన అల్లరి చేయకుండా శాఖ సమీపంలో చేరి, మమ్మల్ని ఎందుకు చేర్చుకోరు? అంటూ మొండికేసి కూర్చునేవారుకూడా ఉండేవారు. ఏకనాథ్ అనే

బాలుడు ఈ రకంగానే గంటల తరబడి శాఖ జరుగుతున్న స్థలంలో గోడలపైన కూర్చుని ఉండేవాడు. ఆతర్వాత కొంతకాలానికి బాలలను కూడా శాఖలో భర్తీ చేసుకోవడానికి అనుమతి లభించగా, తొలి జట్టులోనే సంఘశాఖలో బాల స్వయంసేవక్‌గా చేరిపోయినాడు ఏకనాథ్. వయసుతో పాటు సంఘంలో బాధ్యతలు కూడా పెరుగుతూ ఉండగా అందరూ కొనియాడే విధంగా అత్యంత నైపుణ్యంతో సర్ కార్యవాహ బాధ్యతను నెరవేర్చిన ఏకానాథ్‌జీ ఆ బాల స్వయంసేవకే. అంతేకాదు, కన్యాకుమారి వద్ద సముద్రమధ్యంలో వివేకానంద శిలపై స్వామి వివేకానందుని స్మారక శిలను అనితరసాధ్యమైన రీతిలో దివ్యాతిసుందరంగా నిర్మించి, విశ్వ ఖ్యాతిని ఆర్జించిపెట్టారు. 'ఏకనాథ్ రానడే - ఏక్ బాత్‌కానలే' అంటూ ఆయన స్వభావాన్ని పేరుతో ముడిపెట్టి చెపుతూంటారు మనవాళ్ళు.

## శిలపై చెరగని నామం

ఏకనాథజీకి బాల్య స్నేహితులు, రాష్ట్రీయ స్వయంసేవక సంఘ సర్ సంఘ చాలకులు అయిన శ్రీ బాలాసాహెబ్ దేవరస్, ఏక్‌నాథ్‌జీ ఇహలోకయాత్ర చాలించిన సందర్భంలో మాట్లాడుతూ- "వివేకానంద శిల కార్యక్రమం ప్రారంభమైన తొలిరోజులవి. అనేక కష్టాలు ఎదురైనాయి. అప్పటి సర్‌సంఘ్‌చాలక్ శ్రీ గురూజీ ఆ కార్యాన్ని ఏక్‌నాథ్‌జీకి ఒప్పచెప్పారు. ఆ కార్య పరిపూర్తిలో అడుగడుగునా అనేక సమస్యలు ఎదురవుతాయని శ్రీ గురూజీ ఊహించగలిగారు. అలాంటి కఠిన సమస్యలు ఎదుర్కొని పని సాధించాలంటే ఏకనాథ్‌జీ లాంటివారే అవసరం అని భావించి గురూజీ అలా చేసివుంటారు. శ్రీ గురూజీ ఆలోచన సరైనదే అని కాలం ఋజువు చేసింది. వివేకానంద శిలపైన వివేకానంద స్మారకం నిలచి ఉన్నంత వరకు ఏక్‌నాథ్‌జీని ఎవరూ విస్మరించలేరు. ఏక్‌నాథ్‌జీకి సంబంధించిన ఎన్నో విషయాలు మనవారు చెప్తారు. అద్భుతమైన స్మృతులు

మిగిల్చిపోయారాయన. ఏక్‌నాథ్‌జీ మరణంతో, అసంభవమనుకొన్న దానిని సంభవమే అని చేసి చూపగల్గిన కార్యశాలిని, విలక్షణమైన వ్యూహ సంపన్నుని, దృఢ మనస్కుని మనం కోల్పోయాం" అన్నారు.

## దృఢసంకల్పానికి మారుపేరు ఏకనాథ్‌జీ

ఆరోగ్యంగాను, బలిష్టంగాను ఉన్న శరీరం, విశాల బాహువులు, ఉన్నతమైన ఫాలభాగం, కాస్త నాసికాస్వర మిళితమైన సన్నని స్వరం, కళ్ళద్దాలతో లోతులు వెదుకుతూ ఆలోచనా నిమగ్నమైన అర్ధ నిమీలిత నేత్రాలు, దృఢసంకల్పాన్ని, తాత్త్విక చింతనాన్ని వ్యక్తపరచే ముఖ వర్చస్సు- స్థూలంగా ఇది ఏకనాథ్‌జీ రూప చిత్రణం.

19, నవంబరు 1914 నాడు మహారాష్ట్రలోని అమరావతి జిల్లాలో 'టిలటిలా' పేరుగల ప్రదేశంలో జన్మించిన శ్రీ ఏకనాథ రామకృష్ణ రానడే మొదటి నుంచి చాలా తెలివైన విద్యార్థి, మంచివక్త, నాయకత్వ లక్షణాలు మూర్తీభవించిన వ్యక్తి. తన పెద్దన్న గారింట్లో నాగపూర్‌లోనే ప్రాథమిక విద్యాభ్యాసం జరిగింది. ఆ కాలంలోనే రాష్ట్రీయ స్వయం సేవక సంఘ స్థాపకుడైన డాక్టర్‌జీతో వారికి పరిచయం అయ్యింది. సమాజ సేవకు జీవితం అంకితం చెయ్యాలన్న సంకల్పానికి స్ఫూర్తిని ఇచ్చింది ఆ పరిచయమే.

మెట్రిక్ పరీక్షల్లో కృతార్థులైన వెంటనే ఆయన డాక్టర్జీ దగ్గరకు వెళ్ళి సంఘ కార్య నిమిత్తమై దేశంలో ఏ ప్రాంతానికి పంపించినా వెళ్ళేందుకు సంసిద్ధంగా ఉన్నట్లు తెలిపారు. కాని, డాక్టర్‌జీ అందుకు ఒప్పుకో లేదు. 'ఉన్నత విద్య అభ్యసించటానికి అవకాశం వున్నవారు, ఉన్నత విద్యాభ్యాసం పూర్తి చేశాకనే పూర్తి సమయాన్నిచ్చేందుకు సిద్ధపడాలి.

అప్పుడు సంఘ కార్యం ఇంకా శీఘ్రగతిని అభివృద్ధి చెందుతుంది. అలా కాకపోతే వీడికి ఎక్కడా ఉద్యోగం దొరికే అవకాశం లేక గత్యంతరం లేక సంఘ కార్యం అంటూ బయలుదేరాడు అని ప్రజలు అనుకోవచ్చు. ఈ అభిప్రాయానికి తావు ఇవ్వకూడదు' అన్నారు డాక్టర్‌జీ.

## 'బండరాయి' - 'శుద్ధమొద్దు'

ఏకనాథ్‌జీ 1936లో డిగ్రీ పరీక్ష పాసయ్యారు. ఈలోగా వారి వ్యక్తిత్వం బాగా వికసించింది. అధ్యయన శక్తి పెరిగి, మంచి వక్తగా కూడా రూపొందారు. దీనికి తోడు సహజంగానే అబ్బిన సాహస గుణం, దేహదార్ఢ్యత, ధ్యేయనిష్ఠ ఆయనను ఆదర్శవ్యక్తిగా సమాజం ముందు నిలబెట్టాయి.

ఆయన 1936 లోనే సంఘ ప్రచారకులు అయినారు. నాగపూర్ పరిసరాలలో సంఘ కార్యం చూసే బాధ్యత ఒప్పగించబడింది. 1938 లో మధ్యప్రదేశ్‌కి పంపించబడ్డారు. జబల్పూర్‌ను కేంద్రంగా పెట్టుకుని సంఘ కార్యంలో నిమగ్నమై పోయారు. ఆ రోజుల్లో మధ్యప్రదేశ్‌లోని మహాకోశల్ ప్రాంతంలో నివసించే ప్రజలు హిందీ మాట్లాడేవారు, విదర్భ ప్రాంతంలో నివసించేవారు మరాఠీ మాట్లాడేవారు. వీరిద్దరూ ఒక చోట చేరితే వారిని వీరు, వీరిని వారు ఎద్దేవా చేసుకుంటూ వుండేవారు. మహాకోశల్ వారు విదర్భ వాళ్ళని 'కడ్డీ బెట్' (బండరాయి) అనేవాళ్ళు. విదర్భ వాళ్ళు మహాకోశల్ వాళ్ళను 'రాంగడే' (సభ్యత లేనివారు) అని పిలిచే వారు. సంఘ కార్యార్థమై మహాకోశల్‌కి వెళ్ళాక ఏకనాథ్‌జీ మరాఠీ మాట్లాడే ప్రాంతానికి చెందినవారైనా, మహాకోశల్‌లో గల హిందీ భాషాభిమానుల మధ్య పని చేయాల్సి వచ్చింది.

ఎక్కడైనా సంఘ శాఖలు పెట్టవచ్చు గాని మహాకోశల్ మాత్రం కొరుకుడు పడదు అనేవారు. కాని అలా కొరకరాని కొయ్యగా ఉన్న మహాకోశల్ ప్రాంతంలో ఏక్‌నాథజీ తన సంఘటనా కౌశల్యంతో విస్తృతంగా సంఘశాఖలు నెలకొల్పారు. జబల్‌పూర్‌కు చెందిన శ్రీ కుంజీలాల్ దూబే (ఆ తర్వాత వీరు మధ్యప్రదేశ్ ఆర్థిక మంత్రిగా కూడా పనిచేశారు.) ఖండవాకు చెందిన డా॥ బద్రీప్రసాద్ వంటి ప్రసిద్ధ పురుషులను సంఘచాలకులుగా నియమించి "కఢీబెట్" "రాంగదే"ల గొడవకు స్వస్తి వచనం పలికారు. ఇది ఇలావుండగా మరోప్రక్కన సమాజద్రోహుల బెడదను ఎదుర్కోవడంలో శారీరక సంఘర్షణకు కూడా దిగవలసి వచ్చేది. ఈ సమస్యలతో సతమతమవుతూనే డాక్టర్‌జీ ఆదేశానుసారం సాగర విశ్వవిద్యాలయం నుండి యం.ఏ. పరీక్ష ప్రథమశ్రేణిలో పాసయ్యారు.

శ్రీ భయ్యాజీ దాణి 1942-45 మధ్యకాలంలో మధ్యభారత్‌లో ప్రచారక్‌గా పనిచేసి నాగపూర్ తిరిగివెళ్ళిన తర్వాత మధ్యభారత్‌కు సంబంధించిన కార్యభారం కూడా ఏకనాథ్‌జీకి అప్పగించబడింది. అందువల్ల ఆయన మొత్తం మధ్యప్రదేశ్ అంతకు (అంటే మహాకోశల్, మధ్యభారత్‌లు కలిపి) ప్రాంత ప్రచారకులుగా నియుక్తులైనారు. దేశ విభజన సమయానికి మధ్యప్రదేశ్‌లోని గ్రామ గ్రామాలలో సంఘాన్ని విస్తరింపచేశారు. వందలాది శాఖలు నెలకొల్పబడ్డాయి. సంఘ శిబిరాలు, శిక్షావర్గలు వ్యవస్థిత రూపంలో ప్రాంతమంతటా నిర్వహించబడ్డాయి. 1947 లో సాగర్ విశ్వవిద్యాలయంలో నెలరోజులపాటు నిర్వహింపబడిన సంఘ శిక్షావర్గలో రెండున్నర వేలమంది స్వయంసేవకులు శిక్షణ పొందారు. ఈ శిక్షావర్గ ఎంత సమర్థవంతంగా నిర్వహించబడిందంటే ఈవేళ కూడా అప్పటి సంగతులు చెప్పుకొని పులకితాంతరంగులవుతారు స్వయంసేవకులు.

# మహోత్కృష్ట సత్యాగ్రహ నేత

1948 లో గాంధీజీ హత్యతో సంఘానికి సంబంధం వున్నదన్న కుటిల నేరారోపణ చేసి సంఘాన్ని నిషేధించారు. పూజ్య శ్రీ గురూజీ, శ్రీ దాణీజీ, ఇంకా అగ్రశ్రేణికి చెందిన నాయకులు అరెస్టు చేయబడ్డారు. ఈ పరిస్థితిలో సత్యాగ్రహోద్యమ నిర్వహణ బాధ్యత ఏక్‌నాథ్‌జీపై బడింది. ఆయన మకాం ఢిల్లీకి మార్చారు. ప్రపంచం ఎన్నడూ కనివిని ఎరుగనంతటి పెద్ద సత్యాగ్రహాన్ని జయప్రదంగా నిర్వహించి చూపారు. దేశవ్యాప్తంగా 80 వేల మంది స్వయంసేవకులు జైళ్ళకు వెళ్ళారు. ఈ విధంగా ప్రభుత్వంపైన నైతికమైన వత్తిడి తెచ్చి, అప్పటి అఖిల భారత బౌద్ధిక్ ప్రముఖ అయిన శ్రీ భాయీ మహావీర్ చేత సత్యాగ్రహం నిలుపు చేస్తున్నట్లు ప్రకటన చేయించారు. ఈ విధంగా చర్చలకు అనువైన వాతావరణాన్ని నిర్మాణం చేసి, సంఘంపైన నిషేధం ఎత్తివేయాలంటూ ప్రభుత్వంతో ఉత్తరప్రత్యుత్తరాలు ప్రారంభించారు.

ఏకనాథ్‌జీ అజ్ఞాతంగా ఉంటూనే దేశవ్యాప్తంగా పర్యటన సాగించారు. అద్భుతమైన సంఘటనాశక్తిని ప్రదర్శించి జైళ్ళ వెలుపల ఉన్న స్వయంసేవకుల మనోబలాన్ని పెంచటమేకాక సంప్రదింపులలో మధ్యవర్తులుగా వ్యవహరించడానికి ఢిల్లీకి చెందిన శ్రీ మౌళిచంద్రశర్మ, జబల్‌పూర్‌కు చెందిన ద్వారకాప్రసాద్ మిశ్రా ప్రభృతులను సంసిద్ధపరిచారు. సంఘ నియమావళి (రాజ్యాంగం)లో బాలస్వయంసేవకుల ప్రసక్తి ఉండటం పట్ల శ్రీ మౌళి చంద్రశర్మ అభ్యంతరం చెప్పారు. 'కాంగ్రెస్ వలంటీర్‌దళంలో బాలురను చేర్చుకోవడానికి ఏ రకమైన అభ్యంతరం లేనప్పుడు సంఘంలో బాల స్వయంసేవకులుండటం నేరం ఎలా అవుతుంది?' అన్నారు ఏక్‌నాథ్‌జీ. వృత్తిరీత్యా న్యాయవాది అయిన శ్రీ శాస్త్రి ఈ వాదన తాను అంగీకరించడమేకాక ప్రభుత్వంచేత కూడా అంగీకరింపచేశారు.

1948లో సంఘంపైన నిషేధం తొలగించారు. పూజ్య శ్రీ గురూజీతోపాటు అంతా విడుదల అయ్యారు. శ్రీ గురూజీ అఖిల భారత పర్యటన ప్రారంభించారు. వారు పర్యటించిన ప్రతిచోట ప్రజలు అసంఖ్యాకంగా పాల్గొని అద్వితీయమైన స్వాగతం పలికారు. ఢిల్లీలో రామలీలా మైదానంలో జరిగిన స్వాగతసభలో పదిలక్షలమంది ప్రజలు పాల్గొన్నారు.

కాని ఢిల్లీకి సంబంధించిన సంఘ కార్యం నిషేధ కాలంలో కకావికలై ఉంది. అందుచేత సంఘ కార్యాన్ని సుస్థిరం చేసేందుకు ఏకనాథ్ జీని ఢిల్లీలోనే ఉంచారు. ఆ తర్వాత ఒక సంవత్సరం పాటు అహర్నిశలూ కృషిచేసి ఢిల్లీ శాఖలను శక్తివంతంగా రూపొందించారు ఏకనాథ్ జీ.

1950 లో ఏకనాథ్ జీని పూర్వాంచల్ (బెంగాల్, అస్సాం, ఒరిస్సా) క్షేత్ర ప్రచారకులుగా నియమించారు. కలకత్తా కేంద్రంగా పెట్టుకుని బెంగాల్, అస్సాం, ఒరిస్సా ప్రాంతాల పర్యటన కొనసాగిస్తూ సంఘ కార్య విస్తరణకు పూనుకున్నారు. ప్రాంత భేదాలు, భాషా భేదాలు తల ఎత్తిన కారణంగా అప్పటి పరిస్థితి సంఘానికి అనుకూలంగా లేదు సంఘకార్యం నామమాత్రావశిష్టంగా ఉండేది. అయినప్పటికి పరిస్థితులను లెక్కచేయక దృఢ సంకల్పంతో అంగద పాదం మోపారు శ్రీ ఏకనాథ్ జీ. మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, పంజాబ్ ల నుండి ఈ ప్రాంతానికి అనేకమంది ప్రచారకులు కూడా పంపించబడటంతో సంఘకార్యం నిరాటంకంగా కొనసాగింది.

## లక్షలాది నిర్వాసితులకు ఆశ్రయం

పూర్వాంచల్ ప్రచారక్ గా నియమితులై పంపబడిన తొలి రోజుల్లోనే తూర్పు బెంగాల్ నుండి తండోపతండాలుగా వచ్చి పడుతున్న నిర్వా

సితులకు ఆశ్రయం కల్పించే బాధ్యత చేపట్టవలసి వచ్చింది ఏకనాథ్‌జీ. వారికి కావల్సిన నిత్యావసర సామగ్రిని అందించేందుకు గాను 'వాస్తుహారా సహాయతా సమితి' నెలకొల్పారు. వేలాదిగా పాత్ర సామగ్రి, షామియా నాలు తెప్పించి నిర్వాసితులకు భోజన, వసతి, వైద్య సౌకర్యం కల్పించడంతోపాటు వారు తమ కాళ్ళపై నిలబడ గలిగేందుకు వీలుగా వివిధ వృత్తులలో శిక్షణా శిబిరాలు కూడా నిర్వహించారు.

## చరిత్రలో మైలురాయి

ఏకనాథ్‌జీ 1953 నుండి 1956 వరకు అఖిల భారతీయ ప్రచార ప్రముఖ్‌గా ఉన్నారు. ఈ కాలంలో కార్యకర్తలలో ఉత్సాహాన్ని పెంచి, మనోబలాన్ని పెంపొందించేందుకు ఆయన కొన్ని ప్రత్యేక కార్యక్రమాలు చేపట్టారు. ఈ సందర్భంలో వర్ధా జిల్లాలోని సింధీలో 1954 లో జిల్లా ప్రచారకులకు 15 రోజులపాటు నిర్వహించిన అఖిల భారతీయ శిబిరం పేర్కొనదగినది.

## కష్టాలలో స్పందించడం

1955 ఆగష్టు మాసంలో ఏకనాథ్‌జీ ఆంధ్రప్రాంత పర్యటనకు విచ్చేశారు. ఆ సందర్భంలో నెల్లూరు పట్టణం కూడా సందర్శించారు. వారు ఏ ఊరికి వచ్చినా ఊపిరాడని పని పెట్టుకొంటారు. సమావేశాలు (బైఠక్‌లు), పెద్దలను కలవడం, సంఘస్థాన్ దర్శించడం ఇత్యాది పనుల వత్తిడిలో క్షణం తీరిక లేకుండా ఉంటారు. ఆ రోజుల్లో శ్రీ బాపూరావ్‌జీ మోఘే ఆంధ్రప్రాంత ప్రచారకులుగా ఉండేవారు. మాటల సందర్భంలో విజయవాడకు చెందిన ఒక కార్యకర్త (ఈ పుస్తక రచయిత) దీర్ఘ రోగంతో బాధపడుతూ ఈ ఊరిలో హాస్పిటల్‌లో ఉన్నాడని చెప్పారు. అంతే, వెంటనే కారులో బయలుదేరి, అప్పుడు జిల్లా ప్రచారకులుగా ఉన్న

శ్రీ సోంపల్లి సోమయ్య (ప్రస్తుతం దక్షిణ భారత సేవా ప్రముఖ్), శ్రీ బాపూరావ్‌జీ మోఘే తోడురాగా, హాస్పిటల్‌లో అడుగు పెట్టారు. పరామర్శించడం పూర్తి అయ్యాక డాక్టర్‌ను స్వయంగా కలుసుకొని రోగి చాలా ముఖ్యమైన కార్యకర్త అని, సేవా తత్పరత కల్గిన వ్యక్తి అని శ్రద్ధగా చూసి అనతికాలంలోనే అతడిని సేవాక్షేత్రానికి పంపించే బాధ్యత తీసుకోవాలని నచ్చచెప్పారు. ఏకనాథ్‌జీ కలిసి వెళ్ళిన తర్వాత ఆ డాక్టరు గారు ఎంతో అప్యాయంగా రోగిని పరామర్శించి రెండు నెలలలోనే ఆరోగ్యం కుదుటపరచి డిశ్చార్జి చేశారు.

ఒక సామాన్య కార్యకర్తను అఖిల భారతీయ ప్రచార ప్రముఖ్‌గా ఉన్న నేత పనుల ఒత్తిడి ఎంత ఉన్నా తీరిక చేసుకొని హాస్పిటల్‌దాకా వచ్చి పరామర్శించడం అంటే స్వయంసేవకు ఏవిధంగా స్పందించాలనేది నేర్పడమే. సంఘ కార్యకర్తలు తమ సహచరులు కష్టాలలో ఉన్నప్పుడు ఇలా స్పందించాలని ఆచరణలో తెలియజెప్పారు. కార్యకర్తలను తీర్చి దిద్దడంలో అద్వితీయ శక్తి సంపన్నుడు ఏకనాథ్‌జీ.

## సర్ కార్యవాహ బాధ్యతలో

సర్ కార్యవాహగా ఉన్న దాణీజీ, సహ కార్యవాహగా ఉన్న బాలా సాహెబ్ దేవరస్ ఇరువురూ తీవ్రమైన అస్వస్థతకు గురయై ఉన్న రోజు లవి. తత్ఫలితంగా 1956 లో సమావేశమైన అఖిల భారతీయ ప్రతినిధి సభ ఏకనాథ్‌జీని సర్ కార్యవాహగా ఎన్నుకుంది. సర్ కార్యవాహ బాధ్యతలో సంఘ కార్యవర్గానికి అధినేతగా 1962 వరకు పనిచేశారు. ఈ కాలంలో వివిధ కోణాలలో సంఘ పురోగతికి సంబంధించిన అనేక కార్యక్రమాలు యోజన చేసి అమలుపరిచారు. సంఘ చరిత్రలో ఈ కాలాన్ని ఒక మైలురాయిగా వర్ణించవచ్చు.

నిషేధ కాలంలో జీర్ణావస్థలో పడ్డ సంఘకార్యాన్ని, మౌలిక విలువల ఆధారంగా సుదృఢమైన పునాదులపై సువ్యవస్థితంగా నిలిపేందుకు దైనందిన శాఖలపైన పూజ్య శ్రీ గురూజీ తమ దృష్టి కేంద్రీకరించగా, సంఘ కార్యపద్ధతికి సంబంధించిన వివిధ అంశాలపైన శ్రీ ఏకనాథ్‌జీ తమ దృష్టిని సారించారు. లోక సంపర్క, లోక సంగ్రహ, లోక సంస్కార, లోక వ్యవస్థ ఇత్యాది విషయాలపై లోతులు తరచింది శ్రీ ఏకనాథ్‌జీ ద్వారానే అనడంలో సందేహంలేదు. ఊరికి దూరంగా ప్రశాంత వాతావరణంలో, నిర్మలమైన మనస్సుతోనూ, ఏకాగ్ర బుద్ధితోను, సంఘ కార్య పరిశీలన చేసేందుకు దేశవ్యాప్తంగా ప్రతి జిల్లాలోనూ, మూడురోజులపాటు ఏర్పాటు చేయబడిన కార్యకర్తల శిబిరాలలో రోజుకు రెండు, మూడు బైఠక్‌ల చొప్పున నిర్వహిస్తూ ఒక్కొక్క బైఠక్‌లో కీలకమైన ఒక అంశాన్ని తీసుకుని 2½ గంటలపాటు అనర్గళంగా ప్రసంగిస్తూ కార్యకర్తలకు శిక్షణ యిచ్చారు. 'ఆత్మ సంశోధనం' అన్న విషయాన్ని తీసికొని 2½ గంటలపాటు సాగిన ప్రసంగంలో ఈ విషయం తప్ప మరొక ప్రస్తావన లేదు ఏకనాథ్‌జీ వంటి ప్రతిభా సంపన్నులు అరుదుగా జన్మిస్తారు.

## ఎలుక కాటు

ఈ పర్యటనలో భాగంగా ఏకనాథ్‌జీ వరంగల్లు సందర్శించినప్పుడు వరంగల్లు పట్టణానికి 8 మైళ్ళ దూరంలో ఉన్న ఏకాంత ప్రదేశం పరిగల రామప్పలో మూడురోజుల శిబిరం జరిగింది. రైతులు ధాన్యం నిలువచేసే ఒక పెంకుటింటిలో ఆ సమావేశాలు ఏర్పాటు చేశారు. ఒక రోజు రాత్రి చాపమీద పడుకొని నిద్రిస్తున్న సమయంలో ఏక్‌నాథ్ నుదుటిపైన ఒక ఎలుక కరిచింది. రక్తం కారుతుంటే ఆ రాత్రి మందు మాత్రం ఎక్కడ దొరుకుతుంది? జిల్లా ప్రచారక్ శ్రీ కొచ్చి కృష్ణమూర్తి, మిగతా కార్యకర్తలందరు ఖిన్న వదనంతో నిలబడిపోయారు. ఏదో చేతి

కందిన వైద్యం చేయడం జరిగింది. మరుసటి రోజు మామూలుగా మళ్ళీ కార్యక్రమాలు మొదలయినాయి. ఒక మహాసంస్థకు సర్ కార్యవాహ (జనరల్ సెక్రటరీ)గా ఉన్న వ్యక్తి పరిసరాలను, వసతిని, సుఖాలను లెక్కచేయకుండా పనిచేయడం చూసిన కార్యకర్తల మనస్సులపై పడే ముద్ర చిరంతనమైనది.

## మండల యోజనకు శ్రీకారం

సంఘ కార్యాన్ని విస్తృత పరిచి అన్ని ప్రదేశాలలోను, సమాజంలోని అన్ని వర్గాలలోను సంఘకార్యం వ్యాపించేందుకుగాను సర్వవ్యాపకము, సర్వాదరణీయము అయిన కార్య పద్ధతిని గూర్చి విశ్లేషించి కార్యకర్తల ముందు పెట్టేవారు. ఆ ప్రయత్నంలో భాగంగానే 'మండల యోజన' మనకందించబడింది. ఈ యోజనలో భాగంగా ప్రతి పంచాయితీలోనూ, ముఖ్యమైన బజారులోను, కళాశాలవంటి సంస్థలుగల ముఖ్య స్థానాలలోను కేంద్రీయ శాఖను నెలకొల్పి దానికి నాలుగు ప్రక్కలగల మూడు నాల్గు గ్రామాలలో సంఘ శాఖలు ప్రారంభించే యోజన చేయబడింది. అలాగే మహానగరాలలో ప్రతి పదివేల జనాభాను ఒక యూనిట్‌గా తీసుకుని విస్తార యోజన చేయబడింది. కొన్ని మహా నగరాలలో శాఖల సంఖ్య బాగా ఉన్నప్పటికీ, సంఘం అంటే తెలియని కొన్ని వాడలు మిగిలి వుండటం పరిశీలించిన తర్వాత ఏక్‌నాథ్‌జీ ఈ యోజన చేశారు.

సమాజంలో శక్తి కేంద్రాలకు సంబంధించిన అవగాహన కూడా ఏక్‌నాథ్‌జీ మన కందించారు. సమాజంలోని అన్ని వర్గాలతోనూ, ఆయా వర్గాలకు నేతృత్వం వహించే వ్యక్తులను - ముఖరో చౌదరీ ఇత్యాది నేత అన్నమాట - సంఘ సంపర్కంలోనికి తేవాలి. వారు చదువు నేర్చినవారా, నిశాని దారులా అన్న వివక్ష లేదు.

# విస్తృత పర్యటనలు

భారత దేశమంతటా జిల్లావారీగా పర్యటన జరిపిన ప్రథమ సర్ కార్యవాహ శ్రీ ఏక్‌నాథ్‌జీ. మహానగరాల్లో అయితే ఒక్కొక్కచోట ఎనిమిది రోజుల చొప్పున, పది రోజుల చొప్పున పర్యటన జరిపి, ముఖ్య శిక్షకుల సమావేశం ఏర్పాటు చేసి, ఆచారపద్ధతి (విజిల్ వేయటం మొదలు తుదవరకు శాఖను నిర్వహించే పద్ధతి) నేర్పించారు. ప్రార్థన ఉచ్చారణ, స్వరం అన్నీ అభ్యాసం చేయించారు. ఆంధ్ర ప్రాంత పర్యటనలో చాలాచోట్ల 'శ' ఉచ్చరించడంలో స్వయం సేవకులు వాదనకు దిగితే దేశమంతటా ప్రార్థన ఉచ్చారణ ఒకే విధంగా ఉండేందుకు ఈ ప్రాంతం వారు కాస్త సర్దుబాటు చేసుకోవాలనేవారు.

బైఠక్‌లో 'సూచి' తయారుచేసి సమర్పించే పద్ధతిని కూడా వారే ప్రవేశపెట్టారు. సంఘకార్యంలో ఒక్కొక్క స్వయం సేవక్‌కు సంబంధించిన వివరాలు సేకరించి ఉంచుకోవడం అవసరం అనేవారు. ఈ బైఠక్‌కు 50 మంది రావల్సి వుంది. కాని 35 మందే వచ్చారు అని చెపితే సరిపోదు. కార్యకర్తల అందరి యొక్క పేర్లు, స్థాయి (బాధ్యత, శిక్షణ, సంఘ వయస్సు) పట్టికలో పొందుపరచాలి. అలా అయినప్పుడే రావలసిన కార్యకర్తల్లో రానివారెవరు, రాలేకపోయిన కారణం ఏమిటి? అనేది తెలుసుకోవడమే కాక బైఠక్ వివరాలు కూడా కార్యకర్తకు అందచేయటానికి వీలు అవుతుంది అనేవారు.

# సమన్వయంతో సూత్రబద్ధ వ్యవహారం

సంఘ నిబంధనలు పాటిస్తూనే ఆనవాయితీగా వస్తున్న వ్యవహార సరళిని అనుసరించడం విషయంలో అపూర్వమైన విశ్లేషణ చేసి చూపారు. ప్రతి సంస్థకు లిఖిత పూర్వకంగా ఉన్న నిబంధనలు, క్రమశిక్షణ ఇత్యాది విషయాలతో పాటు లిపి బద్ధం కానప్పటికి అనుసరణీయమైన కొన్ని

మహోద్వేషయా లుంటాయి. (పెద్దల నుండి పుణికి పుచ్చుకున్న విష యాలన్న మాట). సంఘ స్వయం సేవకులకు తమ సంస్థకు సంబంధించిన ఈ పరిజ్ఞానం ఉండటమే కాకుండా అపారమైన అభిమానం వుండాలి. ఈ వారసత్వాన్ని కాపాడుకోవడమే ప్రాణప్రదమైన విషయంగా భావించాలి.

ఈ విషయానికి సంబంధించి వారు ఒక ఉదాహరణ చెపుతూండేవారు. ఏప్రిల్ 1944 లో ఒకసారి మధ్యప్రదేశ్‌లోని ఖండ్వాకు చెందిన లీలాధర్ రాతేడ్ అనే స్వయం సేవక్‌ను సంఘ శిక్షావర్గ జరిగే స్థలం అకస్మికంగా మార్చవలసి వచ్చిందన్న వర్తమానం శ్రీ గురూజీకి తెలియ పరిచేందుకు 'టిమారనీ'కి పంపించారు. అపుడు టిమారనీలో ప్రచారకుల బైఠక్ జరుగుతుంది. అది రెండు గంటలకు ముగుస్తుంది. ఆలోగానే ఈ సమాచారం అక్కడికి చేరాలి. ఈ వర్తమానం తీసుకుని ఆ స్వయంసేవక్ రైల్వే స్టేషన్‌కు చేరారు. కాని పొరబాటున పాసింజర్ బండి అనుకుని అటువైపే వెళుతున్న మెయిల్‌లో ఎక్కేశారు. ఆ రోజున కలకత్తా మెయిల్ ఆలస్యం అయిన కారణంగా పాసింజర్ రావల్సిన సమయానికి మెయిల్ వచ్చింది. మెయిల్ బండికాబట్టి టిమారనీ స్టేషన్‌లో ఆగలేదు. అప్పుడు ఆ స్వయంసేవక్‌కు ఆందోళన పట్టుకుంది. కానీ ఆలోచించే సమయం లేదు. పూజ్య శ్రీ గురూజీకి ఆ బైఠక్ పూర్తి అయ్యేలోగా వర్తమానం అందితీరాలి. ఆవతల స్టేషన్‌లో మెయిల్ ఆగినప్పుడు దిగి మళ్ళీ తిరుగు ప్రయాణం చేసి టిమారనీ వచ్చేలోపుల శ్రీ గురూజీ ముందు నిర్ణయమైన ప్రదేశానికి వెళ్ళిపోతారు కూడా. కార్యక్రమం అస్తవ్యస్తం అయిపోయి శ్రీ గురూజీకి, స్వయంసేవకులకు కూడా ఎంతో అసౌకర్యం జరుగుతుంది.

అంతే! యీ ఆలోచన ఎప్పుడైతే వచ్చిందో ఇక ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయలేదు. నడుస్తున్న బండిలోనించి దూకేశాడు. కంకర రాళ్ళపైన పడటంతో ఒళ్ళు అంతా దెబ్బలు తగిలి రక్తం కారుతుంది.

దావాపు శరీరం కదిలే పరిస్థితిలో లేదు. అయినా అదేమీ లెక్కచేయకుండా ఆ పరిస్థితిలో పరిగెత్తటం ప్రారంభించారు. రొప్పుతూ, రోజుతూ పరుగెత్తుకుపోయి అగ్నైరక్ జరిగే స్థలానికి చేరి వర్తమానం అందించాడు. ఆ సమాచారం ఉన్న కాగితం అందించిన తక్షణం స్పృహ కోల్పోయి పడిపోయాడు. ఈ భూమిమీద నూకలుండి బ్రతికి బైటపడ్డాడు. అయితే చావుకు కూడా తెగించి, తనకు ఒప్పగించిన కార్యాన్ని పూర్తి చేయాలన్న స్వయంసేవకుల సంప్రదాయాన్ని కాపాడాడు.

## సమన్వయ సాధన పద్ధతి

సంఘ సంప్రదాయానికి సంబంధించిన మరో అంశాన్ని కూడా వారు చర్చ చేస్తూండేవారు. ఒక స్వయంసేవకునిపై గాని, కార్యకర్తపై గాని, లేక అధికారిపైన గాని అభియోగం ఉంటే దాని విషయంలో ప్రతివారితోనూ చర్చించకుండా ఆపై అధికారితో మాత్రమే చర్చించాలి. అక్కడ సంతృప్తి చెందకపోతే ఇంకా ఆపై అధికారితో, అదీ సంతృప్తిని ఇవ్వకపోతే, అంతకంటె పై అధికారితో చర్చించాలే కాని బజారుకు ఈడ్వకూడదు. అవసరం అయితే సాక్షాత్తూ సర్‌సంఘ చాలక్‌గారి దృష్టికి కూడా తీసుకుపోవచ్చు. అక్కడ కూడా సంతృప్తికరమైన సమాధానం లభించకపోతే మాట్లాడకుండా ఊరుకోవాలి. కొంతకాలం గడిచాక దానంతట అదే లభిస్తుంది సమాధానం.

## నేడు కాకపోతే రేపు వస్తారు

సంఘ సిద్ధాంతం, ఆలోచనా విధానం పైన ఏకనాథ్‌జీకి పరమ విశ్వాసం వుండేది. వారు తరచూ అంటుండేవారు : సమాజంలో ఉన్న ప్రజలు రెండే రెండు రకాలు—ఒకటి, ప్రస్తుతం స్వయం సేవకులుగా ఉన్నవారు; రెండోది, ముందు ముందు స్వయం సేవకులుగా అయ్యే వారు. అంటే నేడో రేపో అంతా స్వయం సేవకులే అన్నమాట.

అందుచేతనే ఆశోపహతులై, ఆగ్రహంతో సంఘానికి దూరమైన స్వయం సేవకులను పనికిరాని సరుకుగా లెక్కవేయడం ఏకనాథ్‌జీకి గిట్టేది కాదు. కాకపోతే వారిని బుర్ర చెడిన స్వయం సేవకులుగా లెక్కించి, సంఘ సంపర్కంతో ఉన్న స్వయం సేవకుల కంటె ఇంకా ఎక్కువ ధ్యాస వారి పట్ల ఉంచాలనేవారు.

## నిరాశావాదుల పాలిట వెలుగు

మరో విషయంలో కూడా ఏకనాథ్‌జీ పాత్ర మరువరానిది. సంఘ చరిత్రలో అత్యంత నిరాశా పూరితమైన వాతావరణం అలుముకొని వున్న సమయంలో వారు సర్ కార్యవాహ బాధ్యత చేపట్టారు.

స్వయం సేవకులు అనేక అనుమానాలు వ్యక్తం చేస్తూండేవారు. యీ అనుమానాల నివృత్తి పెద్ద సమస్య అయింది. స్వాతంత్ర్యం సిద్ధించాక ఇక సంఘం యొక్క అవసరం ఏముంది-అనే ఆలోచన సామాన్య స్వయం సేవకులనే కాక సంఘ కార్యానికి ఆధార స్థంభాలనదగిన ప్రచారకులలో సహితం తలయెత్తింది. దీనికితోడు దేశ విభజనానంతరం జరిగిన సార్వత్రిక ఎన్నికలలో సంఘం సమర్థించిన భారతీయ జనసంఘ అభ్యర్థులు కేవలం ముగ్గురు మాత్రమే పార్లమెంట్‌కు ఎన్నిక కావటంతో నిస్పృహపాలైన కార్యకర్తలు, మన సాధన, ముఖ్యంగా విభజన సమయంలో స్వయం సేవకులు అనేక కష్టనష్టాలకోర్చి హిందూ సమాజానికి చేసిన సేవల విలువ-ఇంతేనా? ఇంతటి సువిశాల సంఘటనాకార్యం సాధించగల్గిన ఫలితం ఇదేనా? అంటూ పెద్దపెద్ద కార్యకర్తలే నిరాశకు లోనయిపోయారు. భయ్యాజీదాణీ ఆరోగ్యం చూద్దామా అంటే పర్యటన చేయగలిగే స్థితిలో లేనేలేరు.

అంతేకాక, సంఘంపైన విధించబడిన నిషేధకాలంలో సంఘ కార్యం అస్తవ్యస్తమై ఉంది. నెహ్రూగారు, వారి అనుయాయులైన కుహనా సెక్యులర్‌వాదులు సంఘంపైన పనిగట్టుకొని దుమ్మెత్తిపోయడం ప్రారంభించారు. వారు సాగిస్తున్న దుష్ప్రచారాన్ని ఎదుర్కోవలసిన పరిస్థితి వుంది. సంఘానికి బద్ధవిరోధులైన కమ్యూనిస్టులు పట్టపగ్గాలు లేకుండా ఉన్నారు. ప్రప్రథమంగా కేరళలో వారు అధికారంలోకి వచ్చి ఉన్నారు. వారివలన అనేక సమస్యలు సృష్టించబడ్డాయి. కొత్తతరం యువకులు వారి నినాదాలు నిజమనుకొని వారు చెప్పిందే సత్యమన్న భ్రమకు లోనై ఉన్నారు.

అంతటి కష్టసమయంలో ఏక్‌నాథ్‌జీ పూజ్య శ్రీ గురూజీకి సిసలైన సహచరుడుగా వ్యవహరించి సంఘ నౌకకు తెరచాపగా మారి ఆ నిరాశా భరిత సాగరాన్ని దాటడంలో సఫలీకృతులైనారు.

ఏక్‌నాథ్‌జీ యోజన ఎంత వాస్తవికంగాను, ఆచరణయోగ్యంగాను ఉంటుందో చెప్పటానికి మరొక ఉదాహరణ: నిషేధకారణంగాను, ఆ తర్వాత అలుముకొన్న నిరాశాపూరిత వాతావరణం కారణంగానూ సంఘ ఆర్థికస్థితి భయంకరంగా దిగజారిపోయింది. ఈ పరిస్థితి నుంచి బయట పడటానికి ఆయనొక క్రొత్త ఉపాయం ఆలోచించారు. కీర్తి పరాఙ్ముఖ తకు పరాకాష్ట అనదగిన శ్రీ గురూజీని ఒప్పించి దేశంలో ప్రతి ప్రాంతం నుంచి శ్రీ గురూజీ 51వ జన్మదినోత్సవ సందర్భంగా 1956 లో వారికి శ్రద్ధానిధి సమర్పించాలనే యోజన చేశారు. ఈవేళ 26 లక్షల రూపాయ లంటే అంత పెద్దమొత్తంగా మనకు కన్పించదు. కాని 1956లో ఇరవై ఆరు లక్షలంటే సామాన్యమైన విషయం కాదు. అప్పటివరకు దేశంలో సామాజిక కార్యకర్తలెవరికీ అంత పెద్దమొత్తంలో పర్సు బహూకరించ

బడలేదన్న విషయంకూడా గుర్తుంచుకోవాలి. అది అయిపోయాక సంఘం అన్ని రుణాల నుండి బయటపడింది. మళ్ళీ సువ్యవస్థితమైన రీతిలో తన కార్యక్రమాలు కొనసాగించింది. సహజంగానే స్వయంసేవకులు ఉత్సాహ భరితులయ్యారు. 1960లో ఇండోర్‌లో విభాగ్ సంఘ చాలకులు, కార్యవాహలు, ప్రచారకులకు జరిగిన అఖిల భారతీయ వర్గ కూడా ఉత్సాహ పూరిత వాతావరణానికి తోడైంది.

1962లో డాక్టర్‌జీ స్మృతి మందిర ప్రారంభోత్సవ సందర్భంలో జరిగిన అఖిల భారతీయ కార్యక్రమాన్ని కూడా ఈ పరంపరలో భాగంగానే మనం చూడాలి. స్మృతి మందిర నిర్మాణం యోజనలో ఏకనాథ్‌జీ పాత్ర గణనీయమైంది. దేశవ్యాప్తంగా ఉన్న స్వయం సేవకులలో ప్రతి ఒక్కరికి తమవంతు కూడా స్మృతి మందిర నిర్మాణంలో కలసి ఉందన్న భావన కలిగేందుకుగాను ఒక్కొక్క స్వయం సేవకుని నుండి ఒక్కొక్క రూపాయి సేకరించడం జరిగింది. అంతర్గతంగా వారిలో నిక్షిప్తమైఉన్న యోజనాశక్తి బయటపడటంతో శ్రీ గురూజీ పీరికి ఇలాంటి పనులు నల్లేరుపై బండినడక వంటిదని భావించి వివేకానంద శిలపై భవ్యమైన నిర్మాణం చేపట్టే బాధ్యత ఒప్పగించి ఉంటారు.

## సువిశాల సాగరం మధ్యలో శిలాస్మారక నిర్మాణం

1962లో వారికి అఖిల భారతీయ బౌద్ధిక్ ప్రముఖ్ బాధ్యత ఒప్పగించబడింది. 1963లో దేశవ్యాప్తంగా స్వామి వివేకానంద శతజయంతి ఉత్సవాలు పెద్దఎత్తున నిర్వహించడానికి సన్నాహాలు పూర్తి అయ్యాయి. ఆ సమయంలోనే ఏకనాథ్‌జీ వివేకానంద రచనలను పరిశీలించి సారాంశాన్ని సంక్షిప్త రూపంలో 'రైజింగ్ కాల్ టు హిందూనేషన్' అన్న పేరుతో ఆంగ్లంలో ఒక పుస్తక సంకలనం చేసి, 1963 జనవరి మాసంలో

వెలువరించారు. దీని అనువాదం 'ఉత్తిష్ఠ - జాగ్రత' అన్న పేరుతో వెలువడింది. ఈ పుస్తకం యువకులకు చక్కని ప్రేరణ కల్గించిన కారణంగా దేశంలోని అన్ని భాషలలోకి తర్జుమా చేయించి ప్రచురించారు.

స్వామి వివేకానంద శత జయంతి సంవత్సర సందర్భంలో సముద్ర గర్భంలో ఉన్న శిలపైన వివేకానంద విగ్రహం నెలకొల్పాలన్న నిర్ణయం కూడా జరిగింది. ఆ శిలపైనే స్వామిజీ మూడురోజులపాటు ఏకాగ్ర చిత్తంతో ధ్యానం చేసి, దేశ కళ్యాణానికి మార్గాన్వేషణ చేసి విదేశాలలో హిందూ ధర్మ విజయపతాక మెగురవేయడానికి బయలుదేరి వెళ్ళారు.

ఈ కార్య సాఫల్యత కొరకు కేరళలో ప్రఖ్యాతి వహించిన నాయకులు శ్రీ మన్నార్ పద్మనాభన్‌గారి నేతృత్వంలో 1962 లో 'వివేకానంద శిలా స్మారక సమితి' స్థాపితమైంది. కాని అతి త్వరలోనే ఈ సమితికి వ్యతిరేక వాతావరణం ఎదురైంది. వివేకానంద శిలపై ఒక స్థూపం నిర్మాణం చేసి అక్కడొక శిలాఫలకాన్ని ప్రతిష్ఠించడం జరిగింది. కాని క్రైస్తవులు దానిని వ్యతిరేకిస్తూ ఆ శిలకు సెయింట్ జేవియర్ రాక్ అని నామకరణం చేసి స్థూపంను చిందరవందర చేసి పారేసి అక్కడ శిలువను ప్రతిష్ఠించారు. ఇంకా అనేక బాధలు ఎదురయ్యాయి.

ఈ స్థితిలో దేశవ్యాప్తంగా జన జాగరణ కార్యక్రమం చేపట్టి విస్తృతమైన ప్రచారం చేయడానికి ఈ సమితి పూజ్య శ్రీ గురూజీని సంప్రదించగా రాష్ట్రీయ స్వయంసేవక సంఘం సహాయం అందించింది. సహజంగానే ఈ పనికి ఏకనాథ్‌జీ వంటి యోగ్యులైనవారు మరొకరు గురూజీకి కనిపించలేదు. తదనుగుణంగానే ఏకనాథ్‌జీని "వివేకనంద శిలా స్మారక సమితి" సంఘటనా కార్యదర్శిగా ఎన్నుకుంది.

సంఘటనా కార్యదర్శిగా బాధ్యతలు స్వీకరించాక ఏకనాథ్‌జీ దేశమంతటా సుడిగాలిలా పర్యటించ నారంభించారు. దాదాపు 18 మాసాల నిరంతర పర్యటన, పరిశ్రమ కారణంగా ఆశిలపైన స్మారకం నిర్మించ డానికి అనుమతి సంపాదించగలిగారు.

## సాధన మార్గాలు - సాధకుని సామర్థ్యం

అన్నిటికంటె పెద్ద సమస్య శాస్త్రీయ పరిశోధన సాంస్కృతిక కార్యకలాపాల మంత్రి శ్రీ హుమాయూన్ కబీర్ నుంచి ఎదురైంది.

సెప్టెంబర్ 23, 1963 నాడు శ్రీ ఏకనాథ్‌జీ హుమాయూన్ కబీర్‌ను కలుసుకుని, "మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కె. రామరాజ్, హిందూ ఎండోమెంట్స్ అండ్ రెలిజయస్ చారిటబుల్ ట్రస్ట్ మంత్రి శ్రీ భక్తవత్సలం ఇరువురూ విగ్రహ ప్రతిష్ఠ జరపడానికి అంగీక రించారు" అని స్పష్టంగా చెప్పారు. "దేవస్వం బోర్డు వారినుండి కూడా వ్రాత పూర్వకంగా అనుమతి లభించింది, కాని ఆ తర్వాత మీ సలహా మేరకు వీరు తమ అభిప్రాయం మార్చుకొన్నట్లున్నారు" అన్నారు శ్రీ ఏకనాథ్‌జీ. దానికి సమాధానంగా "అసలు ఈ విషయంలో నా అభి ప్రాయం తెలియచేయనే లేదు" అన్నారు శ్రీ హుమాయూన్ కబీర్.

"హిందూ ఎండోమెంట్స్ అండ్ రెలిజియస్ ట్రస్ట్ అధ్వర్యంలో పనిచేస్తున్న దేవస్వం బోర్డు లిఖితపూర్వకంగా ఇచ్చిన ఉత్తర్వులు మార్చుకునే ప్రయత్నం చేయడంలో ఉద్దేశ్యమేమిటి? మీకు ఇష్టం లేదన్న సంగతి మాకు శ్రీ భక్తవత్సలంగారి ద్వారా తెలిసింది. అంతకు పూర్వం మేము ఎప్పుడూ మీ పేరు ప్రస్తావించలేదు'' అన్నారు ఏకనాథ్‌జీ.

ఆ తర్వాత కూడా ఏకనాథ్‌జీ ఎన్నో రకాలుగా తన వాదన విని పించారు. అయినా శ్రీ హుమాయున్ కబీర్ తన అభిప్రాయాన్ని స్పష్ట పరచలేదు.

ఆ తర్వాత తమ కలయికలో వారిద్దరి మధ్య జరిగిన సంభాషణ శ్రీ హుమాయున్ కబీర్‌కు వ్రాసి పంపగా, ఏకనాథజీకి గల జ్ఞాపక శక్తికి ఆశ్చర్యపోతూనే రెండు, మూడు సాధారణ విషయాలు ప్రస్తావన చేస్తూ, దానితోపాటు ఆ శిలపైన మానవ నిర్మిత కట్టడం ఏదీ ఉంచడం నాకు ఇష్టం లేదు అని బయటపెట్టారు.

అక్టోబర్ 9 వ తేదీన డా॥ హుమాయున్ కబీర్‌కు ఏకనాథ్‌జీ ఒక ఉత్తరం వ్రాశారు. దానిలో "మీ వాక్యాలనుబట్టి వివేకానంద శిలపైన విగ్రహం ప్రతిష్ఠించడం మీకు ఇష్టం లేదనేది స్పష్టంగా బోధపడుతుంది. కాని ఈ విషయంలో ప్రజల మనోభావాలు ఏ విధంగా ఉన్నాయో తెలుసు కోవడం మంచిదని భావిస్తున్నాను" అని వ్రాశారు. ఈ ఉత్తరానికి హుమాయున్ కబీర్‌గారి నుంచి వెంటనే సమాధానం లభించింది.

## కాదనే వారిని ఔననిపించే ప్రజ్ఞ

1963 నవంబర్ 11 వ తేదీన మద్రాసు ముఖ్యమంత్రి గారైన భక్తవత్సలంను ఢిల్లీలో కలుసుకున్నారు. ఒక మనిషికి ఎన్ని విధాలు నచ్చచెపితే పని అవుతుందో అన్ని విధాలు ఉపయోగించారు. కాసేపు వినయ విధేయత లుట్టిపడే పలుకులు, కాసేపు పర్యవసానానికి సంబంధించిన హెచ్చరికలు, కాసేపు పొగడ్తలు, కాసేపు తీవ్రంగా మాట్లాడినందుకు క్షమాపణలు, కాసేపు నిర్ద్వంద్వంగా విషయ విపులీకరణ, కాసేపు విజ్ఞాన యుక్తమైన ముచ్చట, కాసేపు మాటకు మాట, కాసేపు తర్కయుతమైన

వాదన - హనుమంతుని వాక్చాతుర్యాన్ని గుర్తుకు తెచ్చే విధంగా సంభాషణ కొనసాగించి భక్తవత్సలం గారిని మెప్పించి తమకు అనుకూలంగా తిప్పుకొన్నారు.

ప్రారంభంలో ఆ శిలపైన వివేకానందుని ప్రతిమ ప్రతిష్ఠించేందుకు అనుమతి కోరినప్పుడు ముఖ్యమంత్రిగారు 'అక్కడ వంతెన నిర్మాణమే గనుక జరిగితే క్రైస్తవులలో సంఘ వ్యతిరేక శక్తులు అక్కడ చేరి విగ్రహానికి రక్షణ లేకుండా చేస్తారు' అన్నారు.

అప్పుడు ఏక్‌నాథ్‌జీ "శిల దగ్గిరకు అందరూ వెళ్తున్నప్పుడు క్రైస్తవులలోని చిలిపివారు అందరి సమక్షంలో అలాంటి పని చేయడానికి సిద్ధపడరు" అన్నారు.

సంభాషణ పొడిగిస్తూ భక్తవత్సలం గారు "ఆ స్థలం మాది, మా రాష్ట్రంలోనిది, ఈ విషయంలో నిర్ణయం తీసుకోవలసింద మేమే. ప్రతిమ ఉంచవలసిన స్థలం అదికాదు ఇది, ఇదికాదు అది అని ఇంతదూరం వచ్చి చెప్పటానికి మీరెవరు?" అన్నారు.

ఆ మాట వింటూనే ఏక్‌నాథ్‌జీ "ఏ ప్రాంతానికి చెందినా, భారత దేశం అంతా ఒక్కటే కాబట్టి శిలాప్రదేశం నాదికూడా. వాస్తవానికి స్థల నిర్ణయం చేసింది నేనుకాదు, మరోవ్యక్తి కాదు. ఈ స్థలానికి సంబంధించి ప్రజలందరి మనోభావన ఒక్కటే. ఏ విధంగా చెపితే మీ మనస్సుకు నచ్చుతుందో నాకు తోచడం లేదు" అన్నారు.

"మీరు నాకు నచ్చచెప్పటం లేదు. బెదిరిస్తున్నారు. దీనికి ఏదో ఒక మార్గం వెతకాలనే ఆలోచనలోనే ఉన్నాను. కాని మీ బెదిరింపులకు లోనై మాత్రం కాదు" అన్నారు శ్రీ భక్తవత్సలం.

"నిజమే, 45 కోట్ల ప్రజల మనోభావన ఎలా వున్నా మీకు లెక్క లేదు. కాని కన్యాకుమారిలో ఉన్న కొద్దిపాటి మత మౌఢ్యాలవల్ల మీరు బెదిరింపబడిన మాట సత్యం" అన్నారు ఏకనాథ్‌జీ.

అసలు ఒక విగ్రహాన్ని సతతం కాపాడవలసిన పరిస్థితిలో ప్రతిష్ఠ ఎందుకు చేయాలి?"

"ఎలాగైనా ఫలకం మళ్ళీ అక్కడ ఏర్పాటు చేయవలసిందే. ఆ తర్వాత దానిని కాపాడాలి కూడా. విగ్రహమైనా, ఫలకమైనా దానిని కాపాడవలసిన అవసరం ఉండనే ఉంది."

"ఫలకాన్ని గూర్చి మీరు ఆలోచించండి. దాన్ని సురక్షితంగా ఉంచడానికి కావలసిన ఏర్పాట్లు అన్నీ ప్రభుత్వం తప్పకుండా చేస్తుంది."

"నేను మనవి చేసేదేమంటే- ఫలకాన్ని కాపాడటానికి ప్రభుత్వం తీసుకునే చర్యలు ఈ విగ్రహాన్ని కాపాడటానికి కూడా సరిపోతాయి. కాబట్టి ఆ కారణంగా విగ్రహ ప్రతిష్టకు అభ్యంతరం చెప్పవలసిన అవసరం ఏముంది?"

"ప్రజల కెవరికీ కనిపించకుండా ఉండే విగ్రహాన్ని అక్కడ ప్రతిష్ఠించడంవల్ల ప్రయోజన మేమిటి?"

"అలా అయితే విగ్రహం సైజు పెంచి అందరికీ కనిపించే విధంగా ఆకారం పెద్దది చేస్తే ఈ సమస్య పరిష్కారం అయిపోతుంది."

"అక్కడ అంత పెద్ద శిలా విగ్రహం నెలకొల్పితే ఆ శిల వద్ద వున్న ప్రాకృతిక సౌందర్యం దెబ్బ తింటుంది."

"అది ఎన్నటికీ కాదు, మహాశయా! వివేకానంద శిల నెలకొన్న క్షేత్రం అందరిని రంజింప చేస్తుంది."

"అయితే మీరు ప్రభుత్వానికి వ్రాయండి. ప్రభుత్వం విచారిస్తుంది."

"మీతో మాట్లాడాక ఈ సమస్య పరిష్కారానికి ఒక మార్గం తోచిందని నాకు చాలా ఆనందంగా ఉంది. మాటల సందర్భంలో అనుకోకుండా మీ మనస్సును నొప్పించిన మాటలు ఏవైనా నానుండి వెలువడినట్లయితే క్షమించమని వేడుకుంటున్నాను" అన్నారు ఏకనాథ్‌జీ

20 నవంబర్ 1963 నాడు ఏకనాథ్‌జీ విగ్రహ రూపాన్ని తగు విధంగా మార్చి ఆ ప్రతిని స్వయంగా తీసుకెళ్ళి ముఖ్యమంత్రికి సమర్పించారు. కాని ఇంతా చేస్తే డిసెంబర్ 31 నాడు ప్రభుత్వం తన అశక్తతను విచారాన్ని వెలిబుచ్చుతూ ఉత్తరం వ్రాసింది.

ప్రొ॥ హుమాయూన్ కబీర్ గారు, మద్రాస్ ప్రభుత్వం గాని వివేకానంద శిలా విగ్రహ ప్రతిష్ఠకు అనుకూలంగా లేరనే విషయం, ఏకనాథ్‌జీ గ్రహించారు. కాబట్టి పార్లమెంటు సభ్యులచేత విషయం కదిలింపచేస్తే అనుకున్నట్లుగా పని అవుతుందని ఆలోచించి, ఎంతోమంది పార్లమెంట్ సభ్యులను కలుసుకుని, వారికి విషయం అంతా విపులంగా విశదీకరించారు.

ఫలితంగా 28 నవంబర్, 1963 రోజున పార్లమెంట్‌లో ఆరుగురు కాంగ్రెస్ సభ్యులు వివేకానంద శిలపై విగ్రహ ప్రతిష్ఠకు ఎదురవుతున్న ప్రతిబంధకాలేమిటో తెలియచెప్పాలని అడిగారు.

కేంద్రం తన సమాధానంలో విగ్రహ ప్రతిష్ఠకు అనుమతించవలసినది రాష్ట్ర ప్రభుత్వమే కాని తమకు సంబంధం లేదన్నది. అది విన్నాక అప్పుడు స్వతంత్ర పార్టీ నాయకులైన శ్రీ ఎన్. జి. రంగా 'ఇంతటి మహత్తర విషయంపై నిర్ణయం తీసుకునే బాధ్యత కేవలం రాష్ట్ర ప్రభుత్వానికి వదలివేయడమేనా? యావద్భారత దేశంలో వివేకానందుని పట్లగల భక్తిశ్రద్ధలను దృష్టిలో ఉంచుకుని కేంద్ర ప్రభుత్వం జోక్యం చేసుకోవలసిన అవసరం ఉంది' అన్నారు.

అప్పుడు తత్సంబంధిత శాఖామాత్యులు ప్రొ॥ హుమాయున్ కబీర్ గారు "ముఖ్యంగా ఇది రాష్ట్రానికి సంబంధించిన సమస్య. కాబట్టి మా తరఫునుండి ఏవిధమైన వ్యతిరేకత వ్యక్తం చేయడమన్న సమస్య ఉత్పన్నం కాదు" అన్నారు.

## 323 మంది సభ్యుల సంతకాలు

ఒక ప్రక్కన పార్లమెంటులో ఈ తర్జన భర్జనలు జరుగుతుండగా మరో ప్రక్కన శిలపై విగ్రహ ప్రతిష్ఠకు అనుకూలంగా పార్లమెంటు సభ్యుల సంతకాల సేకరణకు పూనుకున్నారు, శ్రీ ఏకనాథ్‌జీ. ఈ విజ్ఞప్తి పైన 323 మంది సభ్యులు సంతకాలు చేశారు. ప్రభుత్వ పక్షంకాకుండా ఇతరులు తలపెట్టిన ప్రయత్నానికి ఇంత పెద్ద ఎత్తున సమర్థన లభించడమన్నది అంతకు ముందెన్నడూ భారత పార్లమెంట్ చరిత్రలో లేని విషయం.

ఇంత పెద్ద సంఖ్యలో వ్యక్తిగతంగా పార్లమెంట్ సభ్యులందర్నీ కలపడం, రాజకీయ భేదాలకు అతీతంగా అందరూ ఒక్కమాటమీద నిలిచేట్లు చేయడం అరుదైన విషయం.

విజ్ఞాపన పత్రంపై సంతకాలు చేసిన వారిలో అన్ని రాష్ట్రాలకు చెందిన సభ్యులున్నారు. అలా సంతకాలు చేసిన వారిలో కమ్యూనిస్టులు, ముస్లింలీగ్‌వారు, ద్రవిడ మున్నేట్రక జగంవారు, నేషనల్ కాన్ఫరెన్స్‌కు చెందినవారు, క్రైస్తవులతోసహా అన్ని వర్గాలవారు, రాష్ట్రాలవారు ఉన్నారు.

## ప్రధానమంత్రికి పార్లమెంట్ సభ్యుల వినతి

మహారాష్ట్రకు చెందిన వృద్ధ పార్లమెంటేరియన్ శ్రీ యం. యస్. అణే ద్వారా ప్రధాన మంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ, మద్రాసు ముఖ్య

మంత్రి శ్రీ భక్తవత్సలంగార్లకు పంపబడిన వినతి పత్రంలో "ఈ శిల స్వామిజీ జీవితంతో సన్నిహితంగా ముడిపడి వున్నది. అందుచేత సంపూర్ణ భారతదేశానికి కాదు-యావత్ప్రపంచానికి అది పవిత్ర స్థలంగా మారింది. గయలో బోధివృక్షం క్రింద బుద్ధునికి జ్ఞానోదయం జరిగిన కారణంగా గయ ఎంతో పవిత్ర స్థలంగా ఎలా గుర్తింపు పొందిందో అలాగే ఈ శిలపైన సమాధి నిష్ఠలో ఉన్న స్వామీజీకి ఆత్మ సాక్షాత్కారం జరిగినందున ఈ స్థలం చారిత్రక ప్రసిద్ధి నొందినది."

"మహత్తరమైన ఈ జాతీయ స్మారక నిర్మాణ కార్యక్రమంలో 'సమితి'కి అన్నివిధాలా తోడ్పడవలసిందిగా కేంద్ర ప్రభుత్వానికి, ముఖ్యంగా మద్రాసు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాం" అంటూ వ్రాశారు.

రెండురోజుల లోపలే ఈ వినతి పత్రానికి జవాబు వ్రాస్తూ పండిత నెహ్రూ "భారత ప్రభుత్వానికి సంబంధించినంత వరకు విగ్రహ ప్రతిష్ఠకు స్వాగతిస్తాం. కాని ఈ విషయంలో నిర్ణయం తీసుకోవలసింది మద్రాస్ ప్రభుత్వమే. అయితే నేను మద్రాసు ముఖ్యమంత్రితో ఈ విషయం ప్రస్తావిస్తున్నాను" అన్నారు.

మద్రాస్ ముఖ్యమంత్రి శ్రీ యం. భక్తవత్సలం 3 జనవరి 1964 నాడు సమాధానం వ్రాస్తూ, "ఈ విజ్ఞాపనకు సంబంధించిన అన్ని విషయాలు పరిశీలించడం జరిగింది. ఇప్పటికీ వివేకానంద ప్రతిమను ప్రతిష్ఠించడానికి ఈ శిల ఒక్కటే సరియైన స్థానం అనే వాదనను అంగీకరించలేకపోతున్నాను" అన్నారు.

31 జనవరి 1964 నాడు శ్రీ భక్తవత్సలం శిలా ప్రదేశాన్ని సందర్శించారు. 5 ఫిబ్రవరి 1964 నాడు కోయంబత్తూర్‌లో జరిగిన పత్రిక విలేఖరుల సమావేశంలో మాట్లాడుతూ, "వివేకానంద శిలపై

విగ్రహ ప్రతిష్ఠాపనకు మాకు అభ్యంతరం లేదు. కాని నిర్మాణం బహు చిన్నదిగా ఉండాలి. ఒక చిన్న మందిరంలా నిర్మాణం చేస్తే సంఘ వ్యతిరేక శక్తులనుండి దానిని కాపాడటానికి వీలుగా ఉంటుంది" అన్నారు.

## మరో ఆందోళనకు ఉపక్రమణికా?

23 ఫిబ్రవరినాడు ఏకనాథ్‌జీ తిరిగి భక్తవత్సలం గారిని కలుసుకున్నారు. "ఏంబాబూ, మళ్ళీ ఏదైనా ఉద్యమం ప్రారంభించదలచారా?" అడిగారు భక్తవత్సలం గారు. "లేదు స్వామీ, తమకు కృతజ్ఞతలు తెలుపుకునేందుకు వచ్చాను" అన్నారు ఏకనాథ్‌జీ.

'మందిరం చిన్నదిగా వుండాలి. ప్రాకృతిక రమణీయతకు ఏ మాత్రం భంగం రాకూడదు... ఒడ్డునుండి శిలవరకు నడిచి చేరేందుకు వీలైన వంతెన నిర్మాణానికి మాత్రం అంగీకరించను. సంఘ వ్యతిరేక శక్తులు ఇలాంటి వంతెనను దురుపయోగం చేస్తారు. శిల వద్దకు చేరుకో దలచినవారు నావపైన ప్రయాణం చేసి చేరుకోవచ్చు' అన్నారు భక్తవత్సలం.

"దయతో మీరు మీ అభిప్రాయం స్పష్టంగా చెప్పినందుకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. ఈ అభిప్రాయాలని 'సమితి'కి నివేదిస్తాను. అయితే శిలపైకి సామాను చేరవేయటానికి గాను శిలకు, ఒడ్డుకు మధ్య జెట్టీ నిర్మాణం వెంటనే చేపట్టాలి." అన్నారు ఏకనాథ్‌జీ.

"ఈ కార్యం చేపట్టేందుకు మీరు ప్రభుత్వ అనుమతి పొందాలి" అన్నారు శ్రీ భక్తవత్సలం అలా 1964 సెప్టెంబరులో ఆ అనుమతి కూడా లభించింది.

# కనకవర్షం కురిసింది

స్మారక నిర్మాణానికి అనుమతి లభించడంతోడనే అందుకుగాను అవసరమయ్యే ధనం సేకరించడానికి యోజన తయారు చేశారు. ఆ యోజనను ప్రాంత ప్రచారకులు బైఠక్ జరిగినప్పుడు వారి ముందు ఉంచగా 'ఇంతధనం (10 లక్షలు) సేకరించడం సాధ్యమవుతుందా' అన్నారు అంతా. 'ఏ మాత్రం విచారించకండి, డబ్బు వర్షిస్తుంది' అన్నారు ఏకనాథ్‌జీ.

ఆయన తయారు చేసిన పథకాన్ని, బట్టి ఆలోచిస్తే కావలసిన ధనం సమకూరకుండ వుండే వీలులేదు. యువక హృదయాలలో వివేకానందుని పట్ల అపారమైన భక్తి విశ్వాసాలున్నాయి. అతి సుందరమైన వివేకానంద చిత్రాన్ని కార్డులపైన ముద్రింపచేసి, ఒక్కొక్క కార్డు ఒక రూపాయి చొప్పున విద్యార్థినీ విద్యార్థులకు అందచేస్తే యువతను ఈ కార్యక్రమంలో భాగస్వాములుగా చేసినట్లూ ఉంటుంది, ధనం కూడా సమకూరుతుంది అన్న ఆలోచన వారి ముందు పెట్టారు. విద్యార్థి లోకం ఈ కార్డుల ఉద్యమ లో అమితోత్సాహంతో పాల్గొని జయప్రదం చేశారు.

# కనీసం ఒక్క రాయి

వివేకానందునికి సంబంధించినంత వరకు దేశంలో ప్రతి విద్యాలయం కనీసం తమ వంతు బాధ్యతగా ఒక్క రాయినైనా ఆ కట్టడానికి సమర్పించాలనుకోవడం సహజం. ఒక మంచి గ్రెనైట్‌రాయి ఆ స్థలానికి చేరేట్లు సమకూర్చాలంటే కనీస ఖర్చు 500/- అవుతుంది. కాబట్టి ప్రతి విద్యాలయం కనీసం 500/- సమర్పించాలి. సూటిగా చెప్పిన ఈ మాటలు విద్యార్థులకు, అధ్యాపకులకు, ప్రాచార్యులకు బాగా నచ్చాయి. వారంతా నిస్సంకోచంగా పాలు పంచుకొన్నారు. ఆశించిన దానికన్నా ఎక్కువధనం

సమకూరింది. స్కూళ్ళు, కళాశాలలు మాత్రమే కాకుండా డాక్టర్లు, ఇంజ
నీర్లు, వకీళ్ళు, ఉద్యోగస్తులు అన్ని వర్గాలవారు ఈ మహాభియానంలో
ఉత్సాహంగా పాలు పంచుకున్నారు.

## క్రొత్త రికార్డు

ఒక్కో రూపాయి కార్డుల అమ్మడం ద్వారా 30 లక్షల రూపాయలు సమకూరాయి. అంటే దేశంలోని యువతలో ప్రతి వందమందిలో ఒకరు ఈ ఉద్యమంలో భాగస్వాములైనారన్నమాట! ఈ రకమైన ప్రతిస్పందన కారణంగా, ఏదో కొంత ధనము సమకూరక పోతుందా అన్న ఉద్దేశ్యంతో ప్రారంభమైన ఉద్యమం ఒక కోటి పాతిక లక్షల ధనరాసిని సమకూర్చి పెట్టింది. ఆనాటి వరకు స్వతంత్ర భారత దేశంలో మరే ఇతర స్వచ్ఛంద సంస్థకూడా ప్రజల నుండి ఇంత పెద్ద మొత్తంలో ధనం సేకరించలేదు.

ఏకనాథ్‌జీ దేశంలో ఉన్న ధనిక వర్గాల నుండి కూడా ధనం సేకరించారు. కాని యాచనా భావంతో మాత్రం కాదు 'స్వామి వివేకానందుని వంటి మహా పురుషుల కార్యానికి దేశంలో ధనం సమకూర్చే వారి సంఖ్యకు కొరవలేదు. కాని నేను మీకు ఆ సదవకాశాన్ని ఇవ్వాలని మీ ముందుకు వచ్చాను. మీరు ఈ సువర్ణావకాశాన్ని వినియోగించుకొని మీ డబ్బును సద్వినియోగపరచండి. ఆ పుణ్య ఫలాన్ని అనుభవించండి' అని గర్జించి మరీ ధన సేకరణ చేశారు. కొన్ని చోట్ల నేరుగా డబ్బు ఇవ్వమని అడుగకుండా, నిర్మాణంలో ఒక భాగం మీరు పూర్తి చేయండి అని కోరేవారు-ఘాట్ నిర్మాణం, ప్లాట్‌ఫారం నిర్మాణం, మండప నిర్మాణం, స్టీమర్ కొనుగోలు ఇత్యాది పనులు తమ చేతుల మీదుగా పూర్తి చేయాలని చెప్పేవారు. ఇలాంటి పనులకు ఒక్కోదానికి లక్షరూపాయలు తక్కువ ఖర్చుకాదు. మొత్తంమీద పని బాధ్యత ఒప్పుకొన్నాక కనీసం ఆ మొత్తం ఇవ్వక తప్పేదికాదు.

దేశంలోని వివిధ రాష్ట్ర ప్రభుత్వాల నుండి కూడా ఏకనాథ్‌జీ ఒక లక్షకు తక్కువ గాని విరాళాల సేకరించారు. అలాంటి రాష్ట్రాలలో కమ్యూనిస్టు పార్టీ, డి.యం.కె వంటి పార్టీల ప్రభుత్వాలు కూడా ఉన్నాయి. ఇదికూడా అసాధారణ విషయమే.

ఏకనాథ్‌జీ ఈ నిర్మాణ కార్యక్రమాన్ని అతి శీఘ్రగతిని కొనసాగించారు. సమితికి ప్రభుత్వ అనుమతి సెప్టెంబర్ 1964 లో లభించింది. నిర్మాణ కార్యక్రమం నవంబర్ మాసంలోనే ప్రారంభమైపోయింది. 1970 నాటికి స్మారక నిర్మాణం పూర్తి అయిపోయింది. ప్రారంభోత్సవం ఆ సంవత్సరంలోనే అప్పటి రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి ద్వారా జరిగింది. అలనాటి మద్రాస్ ముఖ్యమంత్రి శ్రీ కరుణానిధి కూడా ఆ ఉత్సవంలో పాల్గొన్నారు. ఆ తర్వాత శ్రీమతి ఇందిరా గాంధి ఈ స్మారక నిర్మాణాన్ని సందర్శించారు.

## భావవ్యాప్తికే వివేకానంద శిలానిర్మాణం

స్వామీజీ పేర కొంత సున్నం, రాయి కలిపి ఒక కట్టడం పూర్తి చేయడంతో తమ పని పూర్తి అవుతుందని ఏకనాథ్‌జీ భావించలేదు. ఆ స్మారక స్థలాన్ని ఎప్పుడూ చైతన్యవంతంగా ఉంచగల మరో ప్రణాళికను కూడా చేపట్టారు. అక్కడ నుంచి స్వామీజీ అందించిన సాంస్కృతిక ఆధ్యాత్మిక సందేశం నిరంతరం దేశ నలుమూలలకు ప్రసరించాలనేది వారి ఆకాంక్ష. కాబట్టి రెండు సంవత్సరాల అనంతరం 1972 లో ఏకనాథ్‌జీ "వివేకానంద శిలా స్మారక సమితి"ని "వివేకానంద కేంద్రం"గా పేరు మార్చి, ఆధ్యాత్మికోన్ముఖమైన సేవా సంస్థగా మార్చివేశారు. ఈ సంస్థను స్వామీజీ ఇచ్చిన సందేశాలను ఆచరణలో చూపే సేవా సంస్థగా రూపుదిద్దారు. ఏకనాథ్‌జీ ఈ సంస్థకు ప్రధాన కార్యదర్శి అయ్యారు. ఈ సంస్థ ఆశయాలు కార్యాచరణలోనికి తెచ్చేందుకు సన్యాసులు కాక

పోయినా ప్రతిభావంతులు, సమర్పణ భావంతో పనిచేయగల శిక్షకులు కావలసి ఉంది. అందుకే సుశిక్షితులు అయిన స్త్రీ, పురుష కార్యకర్తలను సమీకరించడంలో ఏకనాథ్‌జీ నిమగ్నమైనారు ప్రతి సంవత్సరం ఒక జట్టు కార్యకర్తలను కార్యనిర్వాహణకై పంపించడం జరుగుతుంది. సుదూర ప్రాంతమైన అరుణాచల ప్రదేశ్‌కు కూడా కొందరు కార్యకర్తలను పంపించడం జరిగింది.

జూన్ 1978 లో ఏకనాథ్‌జీ ఈ కేంద్రానికి అధ్యక్షులుగా ఎన్నికోబడ్డారు. వారి సంపాదకత్వంలో ఆంగ్లంలో మాసపత్రిక "యువభారత్", క్వార్టర్లీ వెలువడే 'బ్రహ్మవాదిన్', అలాగే ప్రతి అర్ధ సంవత్సరానికి వెలువడే 'వివేకానంద కేంద్ర పత్రిక' ప్రారంభమయ్యాయి.

1978 లో నాగపూర్‌లో ఏర్పడిన 'విశ్వ హిందూ సమ్మేళన్' యొక్క జాతీయ కార్యవర్గంలో ఏకనాథ్‌జీని సభ్యులుగా తీసుకున్నారు. విదేశాంగ శాఖ ఆధ్వర్యంలో పనిచేస్తున్న 'భారతీయ సాంస్కృతిక సంబంధ పరిషత్'లో కూడా ఏకనాథ్‌జీ సభ్యులే.

## వజ్రసమానమైన శరీరం అలసిపోయింది

దృఢ సంకల్పం, సేనానికి తగిన శక్తియుక్తులు, విలక్షణమైన యోజనాశక్తి ఉన్న కారణంగా ఏకనాథ్‌జీ సముద్ర మధ్యంలో విశ్వ ప్రఖ్యాతమైన ఒక భవ్యమైన స్మారక నిర్మాణం జయప్రదంగా పూర్తి చేశారు. కాని ఆ నిర్మాణంలో నిరంతరం ఎదురైన సమస్యల పరిష్కారానికి పాటుపడటంలో వజ్ర సమానమైన వారి కాయం అస్వస్థతకు గురి అయింది. వారు చాలా ఉద్రిక్తత అనుభవించవలసి వచ్చింది. 1978-79 లో క్రైస్తవ మత్స్యకారులు ఫెర్రీ సౌకర్యానికి విఘాతం కల్గించగా ఆయన చాలా వ్యథ చెందారు. తత్ఫలితంగా ఏప్రిల్ 1980 లో ఒకసారి కేంద్రం పరిసరాలలో తిరుగుతూ ప్రజలకు భావి కార్యక్రమా

లను గూర్చి వివరిస్తున్న సమయంలో అకస్మికంగా స్పృహ కోల్పోయి క్రిందపడిపోయారు. రెండేసి వందలమంది కార్యకర్తలపేర్లు ఒక్కసారి విన్నంత మాత్రాన గుర్తుంచుకోగల్గిన అద్భుత జ్ఞాపకశక్తిగల ఏకనాథ్‌జీ తమ జ్ఞాపకశక్తిని కోల్పోయారు.

మద్రాసు, ఢిల్లీ నగరాలలో కొంతకాలం వైద్యం చేయించాక వారి ఆరోగ్యం కోలుకుంది. కాని పర్యటనలు చేసే శక్తి శరీరానికి లేదు. అయినా 'కేంద్రం' యొక్క కార్యగతిలో వేగం సంతరింపచేసేందుకు వారు ఎంతో ఆతురత కనపరిచారు. అంతేకాదు, శ్రేయోభిలాషులు ఇచ్చిన సలహాను కూడా పాటించకుండా పర్యటన ప్రారంభించారు. 'కేంద్రం' యొక్క ముఖ్య కార్యకర్తలతోనూ, 'సంఘం'లో దగ్గరి పరిచయాలున్న వ్యక్తులతోనూ కలవడం ప్రారంభించారు. 1981 లో బెంగుళూరులో జరిగిన జిల్లా ప్రచారకుల అఖిల భారతీయ సమావేశంలో వారు అనేక మంది కార్యకర్తలతో మాట్లాడటం కనిపించింది. ఆ సమయంలో వారి జ్ఞాపకశక్తి బాగా తగ్గిపోయిందన్న దాఖలాలు బాగా కనిపించాయి.

## కీర్తిశేషులైనారు

18 ఆగస్టు 1982 నాడు సుదీర్ఘ పర్యటనానంతరం వారు మద్రాసు చేరారు. అక్కడకూడా తీరికలేని పనిలో నిమగ్నమై పోయారు. 22, ఆగస్టునాడు మధ్యాహ్నం దాటిన తర్వాత రెండున్నర గంటలవరకు మద్రాస్ కేంద్ర కార్యకర్తలతో మాట్లాడుతూనే ఉన్నారు. ఆ తర్వాత విశ్రాంతి తీసుకోవడానికి లేచి వెళుతూ సరిగ్గా రెండు గంటల సమయంలో గుండెపోటుకు గురి అయ్యారు. డాక్టర్లు వచ్చేలోగానే 2 గంటల 45 నిమిషాలకు దేహం చాలించారు.

శ్రీ ఏకనాథ్‌జీ మరణవార్త ఆకాశవాణి, దూరదర్శన్, ఇంకా ఇతర ప్రచార సాధనాల ద్వారా తెలుసుకొన్న ప్రజానీకం వేల సంఖ్యలో ట్రిప్లికెన్‌లోని వివేకానంద కేంద్ర కార్యాలయానికి వచ్చి చేరారు.

ఈ వార్త వినడంతోనే సహసర్ కార్యవాహ గారైన శ్రీ యాదవ రావ్‌జీ జోషి బెంగుళూర్ నుంచి హుటాహుటిన విమానంలో బయలుదేరి మద్రాసు చేశారు. మద్రాస్ ప్రాంత ప్రచారకులైన శ్రీ సూర్యనారాయణ రావుజీ తమ పర్యటన కార్యక్రమం రద్దు చేసుకుని మద్రాసుకు చేరారు. రాత్రంతా అనేక మంది పెద్దలు వచ్చి చేరారు.

23 వ తేదీ ప్రాతః కాలంలో భౌతిక కాయాన్ని విమానంలో త్రివేండ్రం చేర్చారు. శవంతోపాటు శ్రీ యాదవరావుజీ, శ్రీ సూర్యనారాయణజీతో పాటు ఇంకా కొందరు ప్రముఖులు ప్రయాణం చేశారు. త్రివేండ్రం విమానాశ్రయంలో వివేకానంద కేంద్ర కార్యవర్గ అధ్యక్షురాలు డా॥ యం. లక్ష్మీకుమారి, ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. బాలకృష్ణన్, సంఘ దక్షిణాంచల ప్రచారకులు శ్రీ హెచ్.వి. శేషాద్రి, కేరళ ప్రాంత ప్రచారకులు శ్రీ కె. భాస్కర్‌రావులతోపాటు అనేక మంది కార్యకర్తలు శవ సన్మానానికి సిద్ధంగా ఉన్నారు.

భౌతిక కాయాన్ని త్రివేండ్రం నుండి కన్యాకుమారి చేర్చటానికి కేరళ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి అన్ని ఏర్పాట్లు చేశారు.

కన్యాకుమారి జిల్లా కలెక్టర్ శ్రీ యం. బి. ప్రాణేశ్ తమిళనాడు ప్రభుత్వ ప్రతినిధిగా పుష్పగుచ్ఛాన్ని ఉంచారు. రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ సర్ సంఘ చాలక్ శ్రీ బాబాసాహెబ్ దేవరస్ తమ బాల్య మిత్రునికి శ్రద్ధాంజలి ఘటించేందుకు బొంబాయి నుండి విమానంలో కన్యాకుమారికి వచ్చారు.

వివేకానందపురం బీచి ఒడ్డున దహన సంస్కారం జరిగింది. ఆ స్థానం నుంచి ఎప్పుడూ స్మారక మందిరాన్ని అవలోకన చేస్తుండేవారు ఏకనాథ్‌జీ.

శ్రీ ఏకనాథ్‌జీ యొక్క పాత స్నేహితుడు శ్రీ వి. మహాలింగం, వేదమంత్రాలు, వివేకానంద కేంద్ర ప్రార్థన ఉచ్ఛరింపబడుతుండగా, చితికి నిప్పంటించారు. ఈ సమయంలో సూర్యాస్తమయం అయిన కారణంగా వివేకానంద శిలా స్మారకం పైన ఓం చిహ్నంతో విరాజిల్లుతున్న పతాకం అవనతం చేయబడింది. ఎంత విచారకరమైన సన్నివేశం!

ఆ తర్వాత వివేకానందపురంలో డా॥ లక్ష్మీకుమారిగారి అధ్యక్షతన సంతాప సభ జరిగింది. అనేక మంది వక్తలు శ్రీ ఏకనాథ్‌జీని భావోద్వేగంతో స్మరించుకున్నారు.

## అద్భుత స్వప్నసాక్షాత్కారం

వివేకానంద కేంద్ర ప్రబంధ సమితి సభ్యులైన శ్రీ ఆర్. అన్నామలై, "వాస్తవానికి శిలపైన మొదట్లో వివేకానందుని ప్రతిమ చిన్న సైజు దొకటి నెలకొల్పాలని అనుకొన్నాము. కాని ఏకనాథ్‌జీ ఆలోచనలు వేరుగా ఉన్నాయి. ఒకానొక స్వప్నావస్థలో దర్శించిన మహోన్నత నిర్మాణానికి రూపకల్పన చేయ నిశ్చయించుకుని కృతకృత్యులయ్యారు" అన్నారు.

కన్యాకుమారి నుంచి ఎన్నికైన శాసన సభ్యుడు ముద్దుకృష్ణ "కేవలం భారతదేశంలోనే కాక సమస్త ప్రపంచంలోనే కన్యాకుమారికి విఖ్యాతి తెచ్చిన ఘనత శ్రీ ఏకనాథ్‌జీకి దక్కింది" అన్నారు.

డా॥ యం. లక్ష్మీకుమారి, "రక్తమాంసాదులతో కూడిన ఏకనాథ్‌జీ యొక్క భౌతికకాయం మనమధ్య లేదన్నమాటే కాని, కేంద్రం కార్యకర్తల హృదయాలలో వారు నింపిన త్యాగ భావన, సేవాభావం భారత చరిత్రలో జాజ్జ్వల్యమానంగా ప్రకాశిస్తూ అందరికీ మార్గదర్శకం చేస్తుంది" అన్నారు.

స్థిర సంకల్పుడైన ఆ యోధుని శరీరం విశ్రాంతి పొందినమాట నిజంకాని, ఏ అంశాలైతే ఆ వ్యక్తిలో మూర్తీభవించి ఉన్నాయో అవి ఎల్లప్పుడూ సామాజిక కార్యకర్తలకు మార్గదర్శకం చేస్తూనే వుంటాయి.

## లక్ష్యం 'అత్యుత్తమ స్థాయి'

ఏ పని చేపట్టినా లేశమైనా దోషం లేని రీతిలో (సర్వోత్కృష్టమైన రీతిలో) నెరవేర్చినప్పుడే ఏకనాథ్‌జీ సంతృప్తి చెందేవారు. ఉపన్యాసాలలోనూ, ఉత్తర ప్రత్యుత్తరాల విషయంలోనూకూడా అదే జాగ్రత్త. ఇంచుమించుగా సరిపోయే శబ్దం అంటే వారికి గిట్టదు. సరిగ్గా అతికినట్లు సరిపోయే శబ్దమే ఉపయోగించేవాడు. అవసరమైతే అనేకసార్లు వ్రాసిన కాగితాన్ని చించి మరో కాగితం వ్రాయడం, ఉపన్యాసంలో అయితే సరియైన శబ్దం రానప్పుడు మధ్యలో ఆపి ఆలోచించడం చేస్తూ ఉండేవారు. దక్షిణ భారతదేశంలో పర్యటన జరిపేటప్పుడు ఆంగ్లంలో ప్రసంగించవలసి ఉండటంచేత వారు తమతోపాటు తప్పనిసరిగా డిక్షనరీ వెంటబెట్టుకు వెళ్ళేవారని చెప్తారు. శ్రీ పరమేశ్వరన్ "ప్రసంగ మధ్యంలో సరియైన పదం దొరకనప్పుడు కాసేపు ఆపి ఆలోచించేవారు. అంతేకాని, ఏదోఒక శబ్దం ఉపయోగించేవారు కాదు" అని అన్నారు.

ఏ పనైనా ప్రారంభించేముందు అందుకు సంబంధించిన పూర్తి వివరాలు సేకరించాకనే ప్రారంభించేవారు. వివేకానంద శిలాస్మారక స్థాపనకు ముందు స్వయంగా ఆ స్థలానికి ఈదుకుంటూ వెళ్ళి చూశారు. అలాగే ఇంజనీర్లకు, శిల్పులకు సూచనలు ఇచ్చేందుకుగాను ఇంజనీరింగ్‌కు సంబంధించిన విషయాలు అధ్యయనం చేశారు.

## లోతైన విషయాలు

ఎవరైనా ఉత్తరం వ్రాస్తే వెంటనే ప్రత్యుత్తరం వ్రాయాలని కార్యకర్తలకు చెపుతుండేవారు. మన ఎదుట మనిషి మాట్లాడుతుంటే మనం ముఖం ప్రక్కకు పెట్టుకొనడం ఎంతో, ఉత్తరం వ్రాసిన వారికి జవాబు ఇవ్వలేక పోవడము అంతే అనేవారు.

డయిరీలో అవసరమైన సూచన లన్నింటిని లిపిబద్ధం చేసుకోవటం సామాజిక కార్యకర్తలు తప్పనిసరిగా నిర్వహించవలసిన కర్తవ్యం అనేవారు. ఈ డైరీ ఎప్పుడూ వెంట ఉండకపోతే దాని ప్రయోజనం లేదు అనేవారు. అలా చేయని కార్యకర్తలను గట్టిగా మందలిస్తుండేవారు.

కార్యకర్తలు విద్యుత్ ప్రవాహంలోని హై టెన్షన్‌వైర్‌లా వుండాలి. అన్ని వైర్లకంటె పై భాగంలో ఉండే ఈ వైరు ఓల్టేజికి సంబంధించిన అన్ని ఒడుదుడుకులను తట్టుకుని విద్యుత్ ప్రవాహాన్ని సుస్థిరంగా ఉంచి నిరాటంకంగా సాగిస్తుంది. అలాగే ఎలాంటి జటిలమైన సమస్యలు ఉత్పన్నమైనా కార్యకర్తలు పలాయన మంత్రం పఠించరాదు.

మనిషి సృష్టించిన సమస్యలు ఏవైనా మనిషి పరిష్కరించగలుగుతాడు అనడంలో సందేహం లేదు. అయితే, ఎంత విపత్కరమైన సమస్య ఎదురైనప్పటికి గాభరా పడకుండా ఎదుర్కోవాలి ధైర్యంతో, సంతులనంతో సమస్యల పరిష్కారానికి పూనుకోవాలి.

## అప్పుడే నీవు ఉపయోగపడుతావు

కేరళలోని భారతీయ విచార కేంద్ర ప్రముఖులైన శ్రీ పి. పరమేశ్వరన్ అంటారు: "1957 లో నేను కేరళలో ఒక జిల్లాకు ప్రచారక్‌గా

పనిచేస్తున్న కాలంలో ఏకనాథ్‌జీ నాకు జనసంఘంలో పనిచేయమని సలహా యిచ్చారు. 'రాజకీయాల్లో నాకు ఆసక్తి లేదు' అన్నప్పుడు, 'ఈ నిరాసక్తి భావం నీలో ఉండటంచేతనే ఆ బురదలో కూరుకుపోకుండా పనిచేయగల సమర్థత వుంటుంది' అని జవాబు చెప్పారు ఏకనాథ్‌జీ. పరమేశ్వరన్‌జీ జనసంఘం పని చేపట్టారు. ఆ తర్వాత కొద్ది కాలంలోనే వారు భారతీయ జనసంఘ అఖిల భారత ఉపాధ్యక్ష పదవికి ఎదిగి పోయారు.

## వివిధ క్షేత్రాలంటే...

వివిధ క్షేత్రాలలో పనిచేసే కార్యకర్తలు ఎంత పెద్ద బాధ్యత వహించి పని చేస్తున్న వారైనాసరే నిత్య శాఖకు హాజరు కావాలని చెప్పేవారు ఏకనాథ్‌జీ. ఈ విషయంలో ఎలాంటి రాజీ పనికిరాదు. ఒకసారి లక్నోలోని వినాయక్ భవన్‌లో జరుగుతున్న ఒక బైఠక్‌లో జనసంఘ ప్రాంత బాధ్యత వహించి పనిచేస్తున్న ప్రఖ్యాత కార్యకర్త ఒకరు నిలబడి, "మేము చేస్తున్న పని సంఘ కార్యం కాదా?" అని అడి గారు. దానికి జవాబు చెపుతూ, "అలా అనుకొనేవారు పనికి దూరమైనట్లే" అన్నారు ఏకనాథ్‌జీ

ఇప్పుడు అఖిల భారతీయ కిసాన్ సంఘ కార్యదర్శిగా పనిచేస్తున్న శ్రీ సంకటా ప్రసాద్ సింహ, వివిధ క్షేత్రాలలో పనిచేస్తున్న కార్యకర్త లకు కొన్ని సూచనలు ఇవ్వవలసినదిగా కోరినప్పుడు, "మాతృ సంస్థ నుంచి ఎక్కువ సహాయం ఆశించకుండా తమ తమ క్షేత్రాలలో పునాది సుదృఢం చేసుకోవలసి ఉంటుంది" అన్నారు ఏకనాథ్‌జీ. సంఘాన్ని అత్యల్పంగా ఉపయోగించుకుంటూ వివిధ క్షేత్రాలతో సంపర్కంలోనికి వచ్చిన వ్యక్తులను స్వయం సేవకులుగా చేయటానికి ప్రయత్నించాలి.

ఆయన స్వీయంగా తన ఉదాహరణ చెవుతూ, "నాకు వివేకానంద శిలా స్మారక నిర్మాణ కార్యక్రమాన్ని అప్పగించినప్పుడు నేను క్రొత్తగా 1938 లో ప్రచారక్‌గా సంఘకార్యం చేపట్టినప్పటి స్థితికి మళ్ళీ చేరుతున్నాను అనిపించింది" అన్నారు.

"అసలు వివిధ క్షేత్రాల కార్యకర్తలు సంఘంపైనే ఆధారపడి ఉండేట్లయితే ఆ సంస్థలు స్థాపించుకోవడంలో అర్థంలేదు కదా" అంటుండేవారు.

## అసందిగ్ధ మానస్కులు

1973 లో పూజ్య శ్రీ గురూజీ దివంగతులైన తర్వాత శ్రీ బాలా సాహెబ్ దేవరస్‌ను సర్ సంఘచాలక్‌గా నియమించారు. (ఇది పూజ్య శ్రీ గురూజీ వ్రాసిన లేఖను అనుసరించి జరిగింది.) ఏకనాథ్‌జీ అప్పటి వరకు వివేక స్మారక శిలా నిర్మాణ కార్యక్రమంలో మునిగిపోయి ఉన్నారు. ప్రత్యేకంగా సంఘ బాధ్యత అంటూ వారికి ఏమీ లేదు. అయినప్పటికీ సంఘ కార్య అవసరాల దృష్ట్యా వారికి అనేక సందర్భాలలో ముఖ్యమైన కార్యక్రమాలు ఒప్పచెప్పబడుతుండేవి. విశిష్టము, విస్పష్టము అయిన మార్గదర్శనం స్వయంసేవకులకు సర్వదా వారినుండి లభిస్తుండేది.

అలాగే 1973 లో కాన్పూర్‌లో జరిగిన సంఘ శిక్షావర్గలో ఏకనాథ్‌జీ కార్యక్రమం జరిగింది. అనుకోకుండా క్రొత్త సర్‌సంఘచాలక్ శ్రీ బాలాసాహెబ్‌జీ కూడా ఆనాటి బౌద్ధిక్ కార్యక్రమంలో ఉపస్థితులై ఉన్నారు. "పూజనీయ సర్‌సంఘ చాలక్" అని సంబోధిస్తూ ఏకనాథ్‌జీ కొనసాగించిన ప్రసంగం అందరినీ ఆకట్టుకున్నది. అంతకు ముందురోజు సనాతనధర్మ కాలేజీలోని వ్యాయామ శాలలో శిక్షావర్గలోని శిక్షకులకు,

ప్రచారక్‌లకు బైఠక్ జరిగింది. పరిచయం, నివేదికలు పూర్తికావడంతో బైఠక్‌లో ఒక అంశం పూర్తి అయింది. ఏకనాథ్‌జీ మరో అంశం ప్రారంభించబోతుండగా కార్యవర్గవాహగా ఉన్నటువంటి డా॥ కన్నె సింహ అడిగిన ప్రశ్న బైఠక్‌లో ఒక ఉత్కంఠ సృష్టించింది. సూటిగా లేకపోయినా డా॥ సింహ అడిగిన ప్రశ్న సారాంశం ఏమంటే పూజ్యశ్రీ గురూజీ అనంతరం నెలకొనివున్న పరిస్థితిలో ఏకనాథ్‌జీ బాధ్యత స్వీకరించి పనిచేస్తే బాగుండేది అని. అంటే సంఘ బాధ్యతనంతా ఏకనాథ్‌జీయే నిర్వహిస్తే బాగుండునని. ఏకనాథ్‌జీ ఒక్క క్షణంకూడా ఆలస్యం చేయకుండా, "చూడండి, నాకు సంబంధించినంతవరకు ఒక విషయం స్పష్టంగా చెప్పగలను. నేను ఎప్పుడూ మూట (బెడ్డింగ్) కుని సిద్ధంగానే ఉంటాను కాబట్టి అక్కడి నుండి ఇక్కడికి మారటానికి నిమిషం పట్టదు అయితే పూజ్యశ్రీ గురూజీపైన మీకేమాత్రం విశ్వాసం ఉన్నా వారు ఆలోచించి చేసిన ఏర్పాటు ఏదైనా సంఘటనా కార్యాని అత్యంత ప్రయోజనకరమైనదని నమ్మండి" అన్నారు. అసందిగ్ధంగానూ బహు సూటిగానూ ఉన్న ఈ సమాధానాన్ని విన్న తర్వాత కార్యకర్తలందరూ ఆనందానుభూతి పొందారు.

ఇలాంటి అనుశాసనం, సమర్పణాభావం సంఘ కార్యానికి ప్రాణం వంటివి. మనందరికీ ప్రాణప్రదమైన ఈ బాటను వదువకుండా నిరంతరం పయనిద్దాం.



—: o :—